# బ్రహ్మాండేశ్వరి "అమ్మ"



ప్రచురణ

**శ్రీ విశ్వజననీ పరిషత్**

జిల్లెళ్ళమూడి

బ్రహ్మాండేశ్వరి 'అమ్మ'

ప్రతులు : 1000



ప్రతులకు : **శ్రీ విశ్వజననీ పరిషత్**
జిల్లెళ్ళమూడి - 522 113
ఫోన్ : **08643-227492**

**శ్రీ కె. నరసింహమూర్తి**
1వ అంతస్తు, "శ్రీమాత"
1-2-593/29(183)
బాలసాయిబాబా శ్రీనిలయం వద్ద
గగన్‌మహల్ కాలనీ, దోమల్‌గూడ
హైదరాబాద్ - 500 029
ఫోన్ : **040-27661870**

వెల : రూ. **35/-**

ముద్రణ : **సుధా ప్రింటింగ్ వర్క్స్**
అరండల్‌పేట
విజయవాడ - 520 002
ఫోన్ : **0866-6626233**

# తొలి పలుకులు

విశ్వజనని జిల్లెళ్ళమూడి అమ్మ, మా అమ్మ (దుర్గపిన్ని) అక్కా చెల్లెళ్ళ పిల్లలు. రంగమ్మ, సీతాపతి తాతగారి కూతురు విశ్వజనని అనసూయమ్మ అయితే, మా అమ్మ వరాలమ్మమ్మ, హరినారాయణ గారి కూతురు (దుర్గపిన్ని). బంధుత్వానికేమి? అమ్మ విశ్వజననిగా లోకానికి తెలియని కాలం నుండి మా అమ్మమ్మ (వరాలమ్మ) అమ్మను చిన్నతనంలో ప్రేమగా చూచేది. విశ్వజననిగా లోకానికి తెలియటం మొదలైనప్పటి నుండి మా అమ్మ అక్క చెల్లెళ్ళలో ఒకదానిగా కూడా అమ్మను చూచింది. అలాగే మా ఇంట్లో మా అమ్మ నాన్నగారూ, మా సోదర సోదరీమణులు అందరం విశ్వజనని ఒడిలో చేరినవారమే. ఆశీస్సులందినవారమే. ఆ ప్రేమను అనుభవించినవారమే. అలాగే అమ్మ కుటుంబంతో, విశ్వకుటుంబంతో మా అనుబంధం పెరుగుతూనే ఉన్నది.

మా నాన్నగారు శ్రీ కుమ్మమూరు శ్రీరామారావు గారికి 82 ఏళ్ళు నిండటంతో సహస్ర చంద్రదర్శనోత్సవం నిర్వహించాలని సోదరీ సోదరులం భావించాం. ఆ సందర్భంలోనే అమ్మ అనంతోత్సవం (22-6-2014) కూడా కలసి వచ్చింది. "ఇతరులకు ఆదరంగా పెట్టుకో" అన్న అమ్మవాక్యం ప్రతి సంవత్సరం పాటిస్తున్నాం అనంతోత్సవంలో. ఈ సహస్రచంద్ర దర్శనోత్సవం సందర్భంగా అమ్మను గూర్చి ఒక చిన్న గ్రంథం ముద్రించడం బాగుంటుందని అనిపించింది. విశ్వవిద్యాలయ ఆచార్యులు, సుప్రసిద్ధ రచయితలు, పత్రికా సంపాదకులు వ్రాసిన అమూల్యమైన వ్యాసాలు సంకలనం చేసి మాకందించిన 'విశ్వజనని' మాసపత్రిక సంపాదకులు శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్ గారికి, అచ్చుతప్పులు సరిచూసి సహకరించిన "అద్భుత చారిత్ర" రచయిత్రి శ్రీమతి మల్లాప్రగడ శ్రీవల్లి గారికి, శ్రమకోర్చి ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది ఆత్మీయ అభినందన అందించిన "అమ్మతత్త్వ ప్రచారసమితి" అధ్యక్షులు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి, స్వల్పవ్యవధిలో ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించి, సకాలంలో అందించిన సుధా ప్రింటింగ్ వర్క్స్, విజయవాడ వారికి హృదయపూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుతూ, మా తల్లిదండ్రుల సహస్రచంద్ర దర్శనోత్సవ సందర్భంగా ఈ గ్రంథాన్ని మీ ముందుంచుతున్నాం. సహృదయంతో, సానురాగంతో కానుకగా అందుకోగలరని మా విశ్వాసం.

అందరమ్మకు నమస్సుమనస్సులు అర్పిస్తూ...

భవదీయులు

వత్సల, ఎ.పి.శర్మ
వాత్సల్య, ఎ.వి.ఎస్.భాస్కర్

నరసింహమూర్తి, లలిత
హరికుమార్, పావని
కృష్ణ, భానుప్రైమ

# ముందుమాట

చాలాకాలంగా 'విశ్వజనని' మాసపత్రిక సంపాదకులు, మాన్యసోదరులు శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్ కొంతమంది పెద్దల దృష్టికి తెస్తున్నారు పత్రికా సంపాదకులు, ప్రొఫెసర్లు, సుప్రసిద్ధ రచయితలు, ఆధ్యాత్మిక సంపన్నులు వ్రాసిన కొన్ని వ్యాసాలు కలిపి ఒక సంకలనంగా తెస్తే బాగుంటుందని, అమ్మను గూర్చి మరొక కోణంలో తెలుసుకోవటానికీ ఈ గ్రంథం ఉపకరిస్తుందని. మా ఉపాధ్యక్షులు శ్రీ కె. నరసింహమూర్తి, వారి సోదరులు హరికుమార్, కృష్ణలు ఈ సత్కార్యానికి పూనుకోవటం ఆనందంగా ఉన్నది. మరికొన్ని వ్యాసాలుంటే మరొక సంపుటంగా తేవటానికి తగు ప్రయత్నం చేద్దాం.

ఇప్పటి ఈ సంపుటంలో ఒకప్పటి ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసర్ శ్రీ బిరుదురాజు రామరాజు, డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావు (ప్రెస్ అకాడమీ ఛైర్మన్, ఆంధ్రప్రభ సంపాదకులు), శ్రీ తూములూరి లక్ష్మీనారాయణ (జాగృతి సంపాదకులు), శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రి (ఆంధ్రా యూనివర్శిటీ ప్రొఫెసర్), శ్రీ అడపా రామకృష్ణారావు (ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసర్), శ్రీ కొండముది రామకృష్ణ (మాతృశ్రీ సంపాదకులు), శ్రీ వి.యస్.ఆర్.మూర్తి (ఆధ్యాత్మిక శాస్త్రవేత్త), శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు (అమ్మ రెండవ కుమారుడు), శ్రీమతి వసుంధర, శ్రీ రిచర్డ్స్ వంటి కొందరు సుప్రసిద్ధుల రచనలు ఉన్నాయి.

ఈ రచనల విలువ అపురూపమని వేం భావించాం. అలాగే శ్రీ కె.యస్.రామారావు, శ్రీమతి దుర్గపిన్ని సహస్రచంద్ర దర్శనోత్సవం సందర్భంగా ఈ సంపుటిని ప్రచురించటం మా విశ్వజననీ పరిషత్ అభినందిస్తున్నది.

జిల్లెళ్ళమూడి
ది.22-06-2014

భవదీయ
**శ్రీ విశ్వజననీ పరిషత్**

# వేయి పున్నముల వేడుక

అందరినీ ఆదరించు అమ్మలాంటి అత్తగారు
అందరికీ ఆదర్శం అలుపెరుగని మామగారు

అన్నపూర్ణగా నిలచి అన్నమ్మును వడ్డించి
కడుపారా తినిపించి చూచి సంతసించి
క్షణమైనా విశ్రమించి ఆమె ఉండలేరు
అంతులేని అనురాగం ఇంకెంతో ఆరాటం
అందరికీ చెయ్యాలని ఎనలేని ఉబలాటం

మంచివారు మామగారు మమతలున్న వారు
చిటికెలోన పనులన్నీ చేసి చూపుతారు!
విసుగన్నది రాకుండా విచారమే లేకుండా
చెరగని చిరునవ్వులెన్నో చిందిస్తూ ఉంటారు
పరిస్థితుల పరిశీలన పలువిధాల ఆలోచన
చూస్తేనే కలుగునండి ఒక గౌరవ భావన

తనకు తానె సాటి అండి పెద్ద బావగారు
కుటుంబానికంతటికీ పేరు తెచ్చినారు
ఉన్నత పదవుల కొలువై ఉన్నత పథముల నెలవై
ఎంత ఎదిగినా ఎంతో ఒదిగిఒదిగి ఉంటారు
విమానాల విహారాలు దినచర్యే వారికి
విరామము వినోదము దూరమండి వారికి

చుట్టు పక్కలున్నవారు చిటికెలోన తనవారు
చెప్పకోండి వారెవరో చిన్న బావగారు
హరిహరి అన సరిసరి అని పనులెన్నో చేస్తారు
అందరికీ ఆత్మీయత అలవోకగ పంచుతారు

హైదరాబాదు
22-6-2014



అందరికీ గారమండి అన్నింటికి మారమండి
అందరిలో చిన్నండి బుల్లిబుల్లి గారండి
అల్లరితో ఆటలతో ఇల్లంతా సందడే
ఎక్కడ మా వారుంటే ఆనందం అక్కడే

ఆ ఇంటికి అందమండి ఆడపిల్లలు
అందమైన మనసులున్న ఆడపడుచులు
అలసి సొలసినా మరి కలసిమెలసి వుంటారు
పుట్టినింట మెట్టినింట మంచిపేరు తెచ్చినారు

అరుదండీ కనిపించుట అంత మంచి అల్లుళ్ళు
ఎవరికి దొరికేరండి ఇంత మంచి కోడళ్ళు

ఆ ఇంటికి వరమండి వరాల అమ్మమ్మండి
తరతరాల నిధి అండి కారుణ్య జలధి అండి

ఇదే ఇదే మా ఇల్లు అందమైన పొదరిల్లు
మమతలెన్నో వెల్లివిరియు ఆనందపు హరివిల్లు

వేయి పున్నముల వేడుక వేళల
విశ్వజనయిత్రి దీవెన జల్లులు
కుండపోతగా కురవాలి
అండగా మాకు నిలవాలి

కుమ్మమూరు భానుహైమ
బెంగుళూరు



ఇతరులలో దైవత్వాన్ని చూస్తున్నంత సేపూ మనలో దైవత్వం కలుగుతుంది. - అమ్మ

# ఇందులో... ఇదీ వరుస

# అక్షర సుమహారం

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి
అధ్యక్షులు, అమ్మతత్త్వ ప్రచారసమితి
జిల్లెళ్ళమూడి

అమ్మతో అనుబంధం పెంచుకున్న సోదరీసోదరుల కుటుంబాలలో ఏ ఉత్సవమైనా, అమ్మసన్నిధిలో జరుపుకోవడం, ముందుగా అమ్మను అర్చించుకోవడం, అమ్మ ఆశీస్సులు అందుకొని ఆనందించడం మనందరికీ తెలిసిన ఒక మంచి సంప్రదాయం. మాన్యసోదరులు శ్రీ కుమ్ముకూరు శ్రీ రామారావు బాబాయి గారు, శ్రీమతి దుర్గ పిన్ని గారు అమ్మతో బంధుత్వమూ అనుబంధమూ పెనవేసుకున్న దంపతులు, శ్రీ రామారావు గారి సహస్ర చంద్ర దర్శనోత్సవ సందర్భంగా, వారి కుటుంబసభ్యులు అందరూ కలసి అమ్మను అర్చించుకుంటూ, ఆ అర్చనలో భాగంగా అమ్మకు సమర్పించుకుంటున్న నివేదన ఈ వ్యాస సంకలనం.

"రూపం పరిమితమై, శక్తి అనంతమై మాతృత్వం శతపత్రమై విరిసిన సౌందర్యలహరి"గా అమ్మను దర్శించటానికి,

"మెత్తగా హాయిగా ఉంటూనే నిశ్శబ్దంగా ప్రభుత చూపే" అమ్మ మాటలలోని మాధుర్యాన్ని ఆస్వాదించటానికి,

'అమ్మ రూపొందించిన ఆవరణలో మనకు తెలియకుండానే మనలో జరిగే సాధన క్రమాన్ని" గుర్తించటానికి,

"సర్వసృష్టినీ తన బిడ్డగా ప్రేమించమంటున్న" అమ్మ ప్రబోధాన్ని అవగాహన చేసుకోవటానికి,

"ఫిలాసఫీ చదవడమేమిటి నాన్నా!" అంటూ ఛలోక్తి విసిరే అమ్మ మాటలలోని ఉపదేశాన్ని స్వీకరించటానికి,

"లోతైన భావాన్ని ముచ్చటైన మాటల్లో పొదిగి అందించే వాత్సల్య జలధిలో" మునకలు వేయటానికి,

"ఏడిరా నీ ఈశ్వరుడు?" అని అడిగిన వారికి తనను చూపించే విలక్షణమైన అవకాశాన్ని ఇచ్చిన అమ్మ అసలు తత్త్వాన్ని తెలుసుకోవటానికి,



భావం తెలుసుకుని ప్రవర్తించేదే భార్య. - అమ్మ

"కాఫీ కప్పుతో పెట్టిన బియ్యం అంతమందికి ఎట్లా సరిపోయిందో అర్థం కాని" ఆశ్చర్యాన్ని అనుభవించటానికి,

"అమ్మ నిర్మిస్తున్న ప్రశాంత విప్లవోద్యమా"న్ని తిలకించి పులకించటానికి,

"సహజసిద్ధమైన సహనంతో ప్రేమతో లోకాన్ని జయించడం" తన సందేశంగా చూపిస్తున్న అమ్మకు సాగిలపడటానికి,

"సర్వవర్ణ స్వరూపిణి అయిన అంఆ తత్త్వదర్శనం"తో ధన్యులు కావటానికి,

"మాతృమూర్తిగా నిరవధిక కరుణావృష్టిని కురిపిస్తూ మంచి దారి వెంట నడిపిస్తూన్న తొలిగురువు"ను అమ్మలో సాక్షాత్కరింప చేసుకోవటానికి,

అమ్మను "ఉపనిషన్మూర్తి"గా దర్శించి, అమ్మ మాటలలోని నిశ్శబ్దాన్ని, అమ్మ మౌనంలోని వాఙ్మయాన్ని అందుకోవటానికి,

"బిడ్డలలో తప్పేచూడని" తల్లిదనాన్ని కడుపారా గ్రోలటానికి,

"ఒక విశ్వ మానవాలయాన్ని" చూచి తరించటానికి,

సహనాన్ని ప్రసాదించే శక్తిపీఠంపై మూలవిరాట్‌గా అమ్మను ప్రత్యక్షం చేసుకోవటానికి,

"సృష్టిలోని ప్రతిప్రాణినీ తన సంతానంగా సాకే విశ్వజనయిత్రి" సన్నిధిని అనుభవించటానికి,

ఇంకా అమ్మను భిన్న విభిన్న కోణాల్లో దర్శించటానికి ఈ గ్రంథం ఒక చక్కని కరదీపిక కాగలదని నా నమ్మకం.

అమ్మ సన్నిధిలో విశేష అనుభవాలను పండించుకున్న ఎందరో పెద్దలు వ్రాసిన వ్యాస ప్రసూనాలను, అందమైన "అక్షర సుమహారం"గా రూపొందించి, తమ తండ్రిగారి సహస్ర చంద్ర దర్శనోత్సవ శుభోదయాన అమ్మ గళసీమలో అలంకరిస్తున్న శ్రీ నరసింహమూర్తి సోదరులు ధన్యులు.

శ్రీ కుమ్మమూరు శ్రీ రామారావు గారిపై , వారి కుటుంబ సభ్యులపై "అమ్మ" తన కారుణ్యామృత వృష్టిని మరింతగా కురిపించాలని నిండు మనస్సుతో ఆకాంక్షిస్తున్నాను.



# జిల్లెళ్ళమూడి అనసూయమ్మ

– ప్రొఫెసర్ **బిరుదురాజు రామరాజు**

ప్రశాంతంగా నిర్లిప్తంగా దిగంతాలవరకు సాగేచూపులతో, కడలి రూపం ధరిస్తే ఇట్లాగే ఉంటుందనిపించే ఆకృతితో కనిపించే అనసూయమ్మ అందరికీ అమ్మ. ఆ చూపుల్లోని వాత్సల్యం అనురాగం జలపాతమై ఈ జగత్తును ఆర్ద్రం చేసింది. గుంటూరు జిల్లా పొన్నూరు తాలూకా మన్నవ గ్రామంలో (మన్నవ) సీతాపతిశర్మ రంగమ్మగార్లకు జన్మించింది అనసూయమ్మ. రుధిరోద్గారి చైత్రశుద్ధ ఏకాదశి బుధవారం 28-3-1923 అరుణోదయాన అమ్మ అవతరణం.

మన్నవ గ్రామంలో కుర్తాళం మౌనస్వామివారు (1868-1943) కొంతకాలం ఉన్నారు. అష్టసిద్ధులను కైవసం చేసుకున్న ఆ స్వామివారు ఆ ఊళ్ళోని రాజ్యలక్ష్మీ అమ్మవారి విగ్రహం క్రింద రాజరాజేశ్వరి యంత్రం (1922) స్థాపించినారు. దేవాలయ ధర్మకర్త గౌతమగోత్రులు సీతాపతి రంగమ్మ దంపతులు యంత్రప్రతిష్ఠ కొరకు పీటలపై కూర్చున్నారు. తత్ఫలితంగా రాజరాజేశ్వరీ అంశతో అనసూయమ్మ అవతరించింది. తల్లిగర్భంలో ఉన్నప్పుడే అమ్మ తనదైన ప్రత్యేకతను ప్రదర్శించింది. పసిబిడ్డగా ఉన్నప్పుడు కుటుంబంలోని వ్యక్తులకు వివిధ అనుభవాలు కలిగినవి. పుట్టినప్పటి నుండి 18 మాసాలు గొల్లనాగమ్మ పెంపకంలో పెరిగింది. పుట్టుకనుండే కులమతాల కతీతమైన దృష్టి అమ్మకు ఏర్పడింది. అదే జీవనం అలవాటైంది. మూడేండ్ల అనసూయమ్మను తల్లి రంగమ్మ అడిగిన ప్రశ్నలకు జవాబుగా

"నేనుపోతే ఎక్కడ ఉంటావమ్మా?" – "అంతటా!"

"అంటే"? "ఎక్కడయినానమ్మా!"

"ఎవరివద్ద ఉంటావో చెప్పు?" "అందరి వద్దనూ ఉంటానమ్మా!"

"వాళ్ళు నిన్ను సరిగా చూడొద్దూ!"

"నేను వారిని సరిగా చూడాలిగా !

నేనే అమ్మనై ఉంటాగా!" – అన్నది.



ఒకనాటి మాట మరొకనాటికి బాట అవుతుంది. – అమ్మ

ఇదీ అమ్మలగన్నమ్మ నిర్ణయం. ఏడాదిన్నర వయసుకే అమ్మ ఆసనాలు వేస్తూ ముద్రలు పట్టటం బంధువులు గమనించినా గుర్తించినవారు తక్కువ. చిన్నపిల్లల చేష్టలకు మాటలకు ప్రత్యేకత ఏముంటుందనుకుంటారే తప్ప వాటి పరమార్థాన్ని గుర్తించే వారు కొద్దిమందే ఉంటారు. జననమరణాల గురించి, పూజావిధుల గురించి చిన్నప్పటి నుండి అమ్మ అడిగే ప్రశ్నలకు పెద్దలెవరూ సమాధానం చెప్పలేకపోయినారు. అమ్మ తాతమ్మ మరిడమ్మగారు ఏకాంతంగా ఆసనాలు ముద్రలు యోగసాధన చేసేవారు. పుట్టినపుడు అమ్మ నుదుట ఎవరూ పెట్టని బొట్టు మరిడమ్మకు కనబడితే తన ఆధ్యాత్మిక గురువు మల్లెల రత్తమ్మ అనుగ్రహం అని భావించింది.

1927లో మౌనస్వామివారు చీరాలలో నూనె పానకాలు ఇంట్లో ఉన్నపుడు 5 ఏండ్ల అనసూయమ్మ తాతమ్మ మరిడమ్మతో చీరాల పోయి స్వామితో ఏకాంతంగా తత్త్వగోష్ఠి చేసింది. ఐదేండ్ల అమ్మ మెడలోని పులిగోరు పతకాన్ని అపహరించదలచిన పోలీసు మస్తాను ఆధ్యాత్మిక సాధనపరుడైనాడు. అమ్మనగలు తీసుకొని, కుదువబెట్టి డబ్బు తీసుకున్న బిచ్చగాడు అబద్ధమాడినందుకు పాము కరచి చివరికి అమ్మపాదాల చెంత తనువు చాలించినాడు. అమ్మ దివ్యస్పర్శతో తిరిగి జీవనం పొందినాడు. తీసుకున్న సొమ్ము దుర్వినియోగం చేసినందుకు అమ్మ హెచ్చరించినట్లే పాము కరిచిందని తాను చేసిన తప్పిదాన్ని ఒప్పుకున్నాడు.

మస్తానుకు, అంకదాసుకు, ముష్టివానికి - అమ్మ కృష్ణుడుగా పాముగా కనబడి తన తత్త్వం తెలియనీయక తికమక పెట్టింది. తమకు గతి ఏమిటన్నవారి ప్రశ్నకు అందరికీ సుగతేనని సమాధానం చెప్పింది. ధ్యాసే ధ్యానమని బోధించింది. మనుషులకే కాక పశుపక్ష్యాదులకు బాల్యంనుండీ అమ్మ అన్నంపెట్టేది. ఎదుటివారి అవసరాలకు తన ఒంటిపైనున్న నగలను తీసి ఇవ్వటం అమ్మకు చిన్నతనం నుండి వచ్చిన అలవాటు. అమ్మ ప్రదర్శించే ప్రేమాభిమానాలు కులమతాలకు, చేతనాచేతనములకు అతీతంగా ఉండేవి. అమ్మకు మడి,మైలా, కులం, మతం, జాతి, బేధాలు లేవు. అమ్మ జ్ఞాపకశక్తి గొప్పదే. తన చిన్నప్పటి విషయాలే కాక తాను పుట్టకమునుపు ఆయా వ్యక్తుల జీవితాలలోని విశేషాలను చూసినట్లుగా చెప్పటం, ఏ వ్యక్తి ఎప్పుడు-ఎక్కడ-ఎన్నిసార్లు తన వద్దకు వచ్చినాడో చెప్పటం వంటివి ఊహకు అందనివి.

వివాహమై కాపురానికి వెళ్ళేవరకు అమ్మ తమ మాతామహుని సోదరులు చంద్రమౌళి చిదంబరరావుగారి ఇంటనే ఎక్కువ కాలం గడిపింది. అమ్మకు 5-5-1936 నాడు శ్రీవత్సగోత్రీకులు బ్రహ్మాండం నాగేశ్వరరావుతో వివాహం జరిగింది. ఆయన జిల్లెళ్ళ మూడి గ్రామకరణం. వీరి సంతానం ఇద్దరు కొడుకులు, సుబ్బారావు, రవి, కూతురు హైమ. శక్తిస్వరూపిణి అయిన అమ్మ జీవితంలో కనబడే చిత్రమైన సంఘటనలు గమనిస్తే జీవితాన్ని ఎంత తేలికగా గడపవచ్చో అనుభవపూర్వకంగా చెప్పింది. 6-4-1968 నాడు కూతురు హైమ మరణించింది. పద్ధతులన్నీ మామూలుగా ముగించి, మరునాటి నుండి ఆశ్రమ కార్యక్రమాలన్నీ యధావిధిగా జరిపించింది అమ్మ. 16-2-1981 నాడు బ్రహ్మాండం నాగేశ్వరరావు గుండెపోటుతో మరణించినారు. విధులన్నీ పద్ధతి ప్రకారం జరిపిన తరువాత అమ్మ మళ్ళీ దినచర్యలలో పాల్గొనటం అద్భుతమైన విషయం. భర్తను గురించిన సజీవభావన స్త్రీనెప్పుడూ సుమంగళిగానే ఉంచుతుందనటానికి నిదర్శనం అమ్మ.

తనను చూడవచ్చే వారికి అమ్మ 5-5-1958 దాకా తానే వండిపెట్టినది. జనం పెరిగిన కొద్ది ఏర్పాటేదైనా చేస్తే బాగుంటుందని ఈ విషయమై అమ్మను ఒప్పించి 15-8-1958 నాడు అన్నపూర్ణాలయం ఏర్పాటుచేసినారు భక్తులు. అందరూ తలా ఒక సేవా పంచుకొన్నారు. అన్నపూర్ణాలయంలో అందరినీ భోజనం చేసి వెళ్ళమంటుంది అమ్మ. నిరతాన్నదాన కార్యక్రమాన్ని ప్రశంసిస్తే – "ఎవడి అన్నం వాడికుంటే వాడు తింటున్నాడు, మనం పెట్టేదేమిటి? అది ఇక్కడ లేకపోతే వాడు రాలేడు. వచ్చినా తినలేడు" అని అమ్మ సమాధానం. ఎవరు ఎప్పుడు కనబడినా అమ్మ మాట్లాడే మొదటిమాట "అన్నం తిన్నావా?" అన్నదే.

అమ్మ ఉనికితో జిల్లెళ్లమూడి పుణ్యక్షేత్రమయినది. అమ్మ 1962 సంవత్సరం వాడరేవు లలితానందాశ్రమం దర్శించింది. జీర్ణావస్థలో ఉన్న ఆ ఆశ్రమం అమ్మ సందర్శించిన తరువాత వైభవాన్ని పుంజుకున్నది. అమ్మను దర్శించిన మహనీయులలో కళ్యాణానంద భారతి, చీరాల నరసింహయోగి, ముల్పూరు సుబ్రహ్మణ్యశాస్త్రి, లక్ష్మణ యతీంద్రులు మొదలుగా ఎందరో ఉన్నారు. అమ్మదృష్టికి ఆనని విషయం లేదు. జననం, మరణం, కళ్యాణం, ఆగమనం ప్రతి విషయం, ప్రతి నిమిషం ప్రపంచమంతా

అమ్మకళ్ళలో మెదలుతుంటుంది. రూపం పరిమితమై, శక్తి అనంతమై, మాతృత్వం శతపత్రమై విరిసిన సౌందర్యలహరి అమ్మ.

అమ్మసన్నిధిలో పెండ్లిండ్లు జరుపుకుందామని వచ్చిన జనానికి ఎడతెరపి లేని వర్షం పరీక్షగా మారేది. చిత్రంగా ముహూర్తం సమయానికి వర్షం ఆగేది. అమ్మ కళ్యాణం జరిపించేది. భోజనాలైన తరువాత మళ్ళీ కుంభవృష్టి మొదలయ్యేది. జరుగవలసిన పని గురించి అమ్మ వర్షాన్ని ఆపినట్లే కనిపించేది.

ఇమామ్ అనే ముస్లిం యువకుడు అమ్మ సంకీర్తన నామం "జయహో మాతా శ్రీ అనసూయా రాజరాజేశ్వరి శ్రీపరాత్పరి" రూపొందించినాడు. అన్ని నామాలతోను అమ్మను అర్చించేవారు భక్తులు పూర్వం అని చెప్పింది అమ్మ. అమ్మ మాట్లాడే ప్రతి మాటా ఎంతో అర్ధవంతంగా ఉంటుంది. నాకు ఎవరిని చూసినా నాబిడ్డే అనిపిస్తుంది. నా దృష్టిలో ఆత్మగా కనిపించటమే ఆత్మ సాక్షాత్కారం. అంతా దివ్యంగా కనబడటమే దివ్యదృష్టి అంటుంది అమ్మ.

బ్రహ్మజ్ఞానాన్ని అమ్మ - జ్ఞానమే బ్రహ్మగా నిర్వచించింది. శక్తియే దైవమని, సంకల్పమే దైవమని, భక్తియే భగవంతుడని, రక్షణే తల్లి అని, దుష్టసంహారమంటే దుష్టత్వాన్ని సంహరించటమని, రూపరహితుడంటే అన్ని రూపాలు తానైనవాడనీ, పని ఐనా కాకపోయినా అనుగ్రహమేనని, మృత్యుంజయత్వమంటే మృత్యువుగూర్చి భయం లేకపోవటమనీ, వైకల్యం లేనిది కైవల్యమని, సహించలేనిది హింసఅని, సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నది సాధ్వి అని, అంతా ఒకటిగానే తోచేవాడు దేవుడు - అనేకంగా తోచేవాడు జీవుడనీ, గుర్తుచూపించేవాడు గురువని, ఆవేదనే ఆరాధననీ, దిగులే జిజ్ఞాస అనీ, తపనే తపమనీ, తృప్తే ముక్తి అని, మనస్సే దయ్యము - దైవమని - సందర్భానుసారంగా శబ్దచమత్కారాలు ప్రయోగించిన తీరు గమనిస్తే చేతనా చేతనములకే కాదు శబ్దార్థాలకు కూడా అమ్మ ఆమే. కొబ్బరికాయ కొట్టి కుళ్ళిపోయిందే అని బాధపడేవారిని చూసి "కుళ్ళుపోయింది" అని సర్దిచెప్పింది. సమస్యల తోరణాన్ని సమస్యలతో - రణం అని, అవినాభావ సంబంధాన్ని అవి - నా - భావ - సంబంధం అని, సవరణ అవసరంలేనిది వివరణమని, నిగ్రహం కొరకే విగ్రహారాధనమని, తప్పించుకోలేక మనిషి తప్పులు చేస్తాడనీ, తనకు భక్తులెవరూ

లేరు అంతా బిడ్డలేనని, తల్లి తరింపచేసేదనీ, అనుక్నుది జరుగదు- తనకున్నది తప్పదనీ, నేను నేనైన నేను- అనీ అమ్మచెప్పిన నిర్వచనం ప్రతి మాటా ఆలోచింపచేస్తుంది. మార్గాన్ని సుగమం చేస్తుంది. గమ్యాన్ని చేరుస్తుంది.

"నాకు శాస్త్రపరిచయం లేదు నాన్నా! నేను ఏది చెప్పినా నా అనుభవంలోవే చెప్పా. ఆలోచన మనస్సు కాదుగా! మనస్సుకు ఆలోచనలు వస్తున్నాయి" అంటుంది. అమ్మ సంప్రదాయాలపై తిరుగుబాటును బోధించటమే కాదు ఆచరింపచేసింది అమ్మ. కొడుకుల్లేని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారికి ఆయన పుత్రిక గాయత్రి చేతనే కర్మకాండ జరిపించింది (1977) తన సన్నిధిలో. పూజకు ఆటంకం కలిగిందని బాధపడే భక్తురాలితో - తనకు అంటు, ముట్టు వంటివి లేవన్నది. తనవారు మరణించినా - తనకోసం వచ్చిన వారికి ఇబ్బంది కలుగకుండా సంతోషంగా వారి కార్యక్రమాలు జరిపించింది.

అవధూతలు యోగులు మానవాళికి చేయవలసిన మేలు, బోధించదలచిన సందేశాలు ప్రచారం చేసి తాము వచ్చిన పని అయిపోగానే అవతారాలు చాలిస్తుంటారు. అయితే సాధారణ మానవులకు వచ్చే జబ్బులు, కలిగే ఇబ్బందులు మహాత్ములకు కూడా తప్పవన్నట్లు అమ్మ కర్మానుభావాన్ని ప్రత్యక్షంగా ప్రదర్శించింది. అమ్మకు వచ్చిన క్యాన్సరు వ్యాధి అటువంటిదే. అనుగ్రహ వీక్షణంతో, స్పర్శతో, వాక్కుతో, సంకల్పంతో, ప్రసాదంతో ఎందరినో తరింపచేసిన ఆతల్లి శరీరంలో చేరిన వ్యాధులను నిబ్బరంగా అనుభవించింది. చివరికి డాక్టర్ల ప్రయత్నాలన్నీ విఫలమైనపుడు అమ్మ - "శిధిలమయ్యే ఈ శరీరానికి ఎన్నాళ్ళని పోటీలు పెట్టమంటారు? సహనం చచ్చిపోయిన పిమ్మట బతక్కూడదు. నేను వచ్చిన పని అయిపోయింది. ఇక నన్ను పోనీండి, నవ్వుతూ నన్ను పంపించండి" - అని తన నిర్ణయాన్ని తెలియచేసింది. కాన్సరు గడ్డ కూడ అమ్మకు బిడ్డే. అవరణంలోని జనాన్ని అందరినీ పిలిపించుకొని చూసింది. అందరి ఇష్టప్రకారం నడుచుకుంటున్నట్లు కనిపించే అమ్మ తన ఇష్టానుసారంగా క్రోధన సంవత్సరం జ్యేష్ఠబహుళనవమి - దశమి బుధవారం శూన్యతిధి(12-6-1985) నాడు తనువు చాలించింది. ఇప్పుడు అనసూయేశ్వరాలయం నుండే యధావిధిగా పనులన్నీ జరిపిస్తున్నది.





రెండు వస్తువులు కలిస్తేగాని మరో వస్తువు గుణం బైటికిరాదు. - అమ్మ

# మధురానుభూతి

- రిచర్డ్ షిఫ్‌మన్

దక్షిణ భారతంలో జిల్లెళ్ళమూడి గ్రామంలో ఒక అమ్మ ఉన్నది. తన పిల్లలకు అన్నం పెడుతుంది. వారి అనారోగ్యంలో సాకుతుంది, వారిని మందలిస్తుంది అప్యాయంగా బుజ్జగిస్తుంది. ఆపదలో ఓదారుస్తుంది. సుఖదుఃఖాలలో వారి కన్నీళ్ళు తుడుస్తుంది. ఆ అమ్మ దాదాపు అందరి వలెనే ఉంటుంది. చూపులోగాని, తీరులోగాని మామూలు గుంపునుంచి విడదీసేందుకు ఏరకమైన విశేషం గాని, వ్యక్తిత్వలక్షణం గాని కనపడదు. అయినా ఒక్క ప్రత్యేక లక్షణం లేకపోయినట్లయితే వేలాదిమందిచేత ఆరాధింపబడటం కాదు గదా! కనీసం గమనింపబడి ఉండేవారు కూడాకాదు. ఏమిటి ఆ ప్రత్యేక లక్షణం? అందరి తల్లులనుంచి అమ్మను విడదీసి చూపుతున్నది ఒక్క మాటలో చెప్పాలంటే - సామాన్యంగా మనం మన ఆపేక్ష అప్యాయతలకు పరిధులు గీసుకుని గర్భవాసాన పుట్టినవారినే మన సంతానంగా భావిస్తాం. కాని అమ్మ అలాకాదు. సర్వమూ తన సంతతిగానే భావిస్తుంది. సకల మానవులు జంతువులు, వస్తువులు, ఆలోచనలూ, గుణాలు- సర్వమూ అందరినీ అన్నిటి ఎక్కడున్నా గాఢమైన ఆపేక్షతో ప్రేమాదరాలతో దయతో పరామర్శిస్తుంది.

సమస్త విశ్వంలో దేనినీ ఈ అమ్మ జడంగా చూడదు. చైతన్య రహితంగా చూడద ఈ అనంత సువిశాల చైతన్య ప్రవాహంలో నామ రూపావస్థా వైవిధ్యంలో ఎడతెరి లేకుండా తన సంతానాన్నే చూస్తుంది. అమ్మలో మూర్తీభవించి భాసిల్లే సంపూర్ణమై ప్రేమ, ఏకైక దర్శనమూ మానవ జీవితంలో పొందదగిన తలమానికమై విజయనికేతనాలు - వాటికి ఉన్ముఖమైన గమనమే అరుదు. గమ్యం చేరుకోవట అరుదు. కాని అమ్మ విషయంలో వానికై గమనమూ, గమ్యం చేరుకోవటం అ ప్రశ్నలే లేవు. మొట్టమొదటి నుండి అమ్మ ఒకేవిధంగా ఉన్నది. అదృష్టవంతులై ఏకొద్దిమందో అమ్మ చిన్నతనంలోని ఉన్నతస్థితికి తార్కాణాలుగా నిలిచారు.

తరచూ ఎందరికో అమ్మ బాల్యంలో అద్భుత మనిపించే అసాధారణ దర్శనా కనుపించేవి. అమ్మను కృష్ణపరమాత్ముని వలె, రాజరాజేశ్వరిదేవి వలె, క్రీస్తు భగవాన



శిల్పానికి అందం రావాలంటే ఉలిదెబ్బలు అవసరం. - అమ్మ

వలె ఇంకా ఎన్నో దేవతా రూపాలలో ఎందరెందరో దర్శనానుభూతులు పొందారు. సర్వసాధారణంగా చాలామంది ఆ పసికందులో పరమపవిత్ర వ్యక్తిత్వాన్ని మహోన్నత మాతృత్వాన్ని గుర్తించారు. అర్ధశతాబ్ది క్రితం ఏ లక్షణాల మూలంగా అమ్మవైపు ఆకర్షితులైనారో అవే లక్షణాల వలన అసంఖ్యాకులయిన యాత్రికులు నేడు జిల్లెళ్ళమూడికి ఆకర్షితులవుతున్నారు.

జిల్లెళ్ళమూడి గ్రామంలో అమ్మ చుట్టూ వర్ధిల్లిన అందరిల్లు దేశంలో ప్రధాన ఆధ్యాత్మిక కేంద్రమైంది. ఆంధ్రదేశం నలుమూలల నుంచి అసంఖ్యాక జనం అమ్మ దర్శనానికి వస్తారు. దేశంలో ఇతర ప్రాంతాలనుండి విదేశాలనుండి వచ్చే యాత్రికుల సంఖ్య పెరుగుతోంది. రావటంలో గల కారణాలు వచ్చే యాత్రికుల వలెనే ఎన్నో రకాలు. అద్భుత శక్తులగురించిన కథలతో ఆకర్షితులై కొందరు, వ్యాపార విజయానికై కొందరు- ఇలా ఎన్నో విధాలు, ఆధ్యాత్మిక జిజ్ఞాసువులైన మరికొందరు ఒక మహా 'యోగిని' నుండి ఆశీర్వచనానికై మార్గదర్శకం కోసం వస్తారు. తత్వపరిశోధకులు అమ్మ జ్ఞానసీమను కొలవాలని కొందరూ, అమ్మనుండి సంశయ నివృత్తికై కొందరూ వస్తుంటారు. సాంప్రదాయకులయిన హిందువులు ఆదిశక్తి అవతారంగా భావించే అమ్మను శాస్త్రోక్తరీతిలో పూజించుకునేందుకు వస్తారు. ప్రారంభంలో ఏ ఉద్దేశంతో మనం అమ్మను చూచేందుకు వచ్చినా, తిరిగి తిరిగి మళ్ళీ రావటానికి మాత్రం అందరికి ఒకటే కారణం. అమ్మలో మనం మహోత్కృష్టమైన ప్రేమకు ఉన్నతమైన ఆధారమునకు మూలాన్ని చూడటమే కారణం. అమ్మ అనే పదానికి ఎంతో నిజమైన గొప్పదయిన భావాన్ని అమ్మలో చూస్తాం.

అమ్మసాన్నిధ్యంలోనికి మనం మొదటిసారి వచ్చినపుడు మనలను అంతకుముందే ఎరిగిఉన్నట్లుగా, మనం క్రొత్తవారం కానట్లుగా విచిత్రమైన తెలిసినతనంతో గమనిస్తుంది అమ్మ. అమ్మ ముఖకవళికలలో పరమ ప్రశాంతతతోపాటు, అతిలోక లక్షణమైన కాంతి ఉంటుంది. అయినా తన చుట్టూ చేరిని వారిని చూస్తుంటే ఆ చూపులో హావభావాలలో తల్లికనబరిచే ఆసక్తి గోచరిస్తుంది.

మామూలుకన్నా పెద్దదైన కుంకుమబొట్టు కనుబొమ్మల మధ్య ఉండటంతో విశేషమైన ప్రాధాన్యం గల అమ్మ కనులవైపు మనం లాగబడతాం. అందని లోతులతో,



తనను కన్న వాళ్ళమీద కంటె తను గన్నవాళ్ల మీద ప్రేమ ఎక్కువ. - అమ్మ

సూక్ష్మమైన శక్తితో నిలదీసే కళ్ళు అవి. ఏమాత్రం వ్యాకులపాటు స్వీయప్రజ్ఞ అనే బుడగలులేని నిశ్చల కాసారాలు అమ్మ కళ్ళు. అమ్మ మనలను చూస్తున్నపుడు ఆ దృష్టి మనం అంతరంగపు అడుగులదాకా పోతుంది. అయినా మనం ఏ ఇబ్బందికీ గురికాము. ఎందుచేతనంటే ఆ దృష్టి ఎంతో సన్నిహితమై సున్నితమై గొప్పహాయినిస్తుంది. అజ్ఞాతమైనదేదో మనలో జాగృతమై కదులుతుంది. చాలామంది చెప్పలేని భావోద్వేగానికిలోనై ఏడుస్తారు. కొందరు పరమ ప్రశాంతత మృదువుగా అవతరించటం అనుభవిస్తారు. అమ్మ ప్రశాంత వీక్షణలో, యుగాలుగా మరచిన పరమ రహస్యం ఒక్కమాటుగా మన ముందుంచినట్లు దాదాపు అందరికీ పోగొట్టుకున్నదేదో కాళ్ళకు చుట్టుకున్నట్లనిపిస్తుంది.

అమ్మకు సర్వమూ తెలుసు – అమ్మకు సర్వమూ సమ్మతమే అనే ప్రేరణ సహజంగా కలుగుతుంది. ఈ అవగాహనతో పాటు ఎంతోకాలంగా మనసుకలవాటు పడిన దోష భయాందోళనల మోతబరువు దిగినట్లు ఒక్కసారిగా మనసు చక్కటి స్వేచ్ఛాభావన పొందుతుంది. కృతజ్ఞత నిండిన మూగ ప్రార్థనతో మన అంతరంగం ఊర్ధ్వలోకాలకు దూసుకువెళుతుంది. అపారమైన సువిశాలమైన అంతర నిశ్శబ్దంలో 'అమ్మ' అనే ఒక్క పదం అప్పుడప్పుడు ప్రతిధ్వనిస్తుంటుంది. ఒకరకంగా అప్పటికి పూర్తిగా అంతుపట్టకపోయినప్పటికి ఇంటికి తిరిగి చేరుకున్నట్లు మనకు ఎరుక అవుతుంది.

మనలో చాలామందికి ఈ మొదటి భావోద్వేగం (fade) త్వరలో తగ్గిపోయి మనకు అనుభవంలో ఉన్న ప్రతిస్పందనలూ, మనోవృత్తులూ చోటుచేసుకుంటాయి. అయినా మనకు ప్రసాదింపబడిన ఈ అద్భుతమైన దివ్యదర్శనం మాత్రం మరిచిపోలేం. నాటిన విత్తనం వలె ఎదలో పదిలమై అదృష్టంగా ఉండి అతిలోక జీవన పిపాసగా పరిపూర్ణమై (mature) తీరుతుంది.

ఆపుకోలేనంతగా ఎంతోమంది ఎందుకు మళ్ళీమళ్ళీ జిల్లెళ్లమూడి వస్తుంటారో కొంచెం సమయం అమ్మదగ్గర కూర్చుంటే చాలు తెలుస్తుంది. ప్రతిరోజూ అమ్మ చిన్నగదిలో ఎడతెగకుండా యాత్రకి జనతా ప్రవాహం సాగుతూనే ఉంటుంది. చాలామంది కొద్దిసేపు అమ్మవద్ద సంభాషిస్తూనో, మౌనంగా గమనిస్తూనో ఉంటారు.

ఏరోజు కారోజు ప్రపంచంలోని సుఖదుఃఖాల బరువునంతా అమ్మ పాదాల ముందు క్రుమ్మరించినట్లుగా ఉంటుంది. ఎన్నడూ తరుగుతున్నట్లుతోచని ఆసక్తితో ఎంతో ఓర్పుతో శ్రద్ధగా అందరు చెప్పేది వింటుంది. ప్రతి ఒక్కనికి అప్యాయతతో రంగరించిన ఒక మంచిమాటో, చిరునవ్వో, బుజ్జగింపో ఏదో ఒకటి అమ్మ పదిలపరుస్తుంది. ఏ ఒక్కరినీ వదలదు. ఏ ఒక్కరినీ తిరస్కరించదు. జిల్లెళ్ళమూడికి ప్రయాణం ఎలా సాగిందీ, భోజనం చేసింది, లేనిదీ, వ్యక్తిగత విషయాలతో సహా పరామర్శిస్తుంది. అమ్మతీరు ఎంతో నిరాడంబరంగా మనలను ఎంతోహాయిగా ఉంచుతుంది. అమ్మ ముఖకవళిక లెంతో కాంతిమంతమై, స్నిగ్ధమై, మార్దవంగా ఉంటే అమ్మమాటలు మెత్తగా, హాయిగా ఉంటూనే నిశ్శబ్దంగా ప్రభుత చూపుతాయి. ఆరితేరిన కళాకారుని వలె (Artist) అమ్మ అల్లిన గొప్ప సంతోష సమన్వయ వాతావరణంలో పీటముడి పడిన సమస్యలు మంచులా కరిగిపోయి ఆందోళనలతో బిగిసిన ముఖాలన్నీ, దరహాస భాసురాలవుతాయి. పునీతం చేసే గొప్ప ప్రవాహంలో మనం ప్రక్షాళితులమయినట్లు నూతనోత్తేజంతో మనం అమ్మగదిని వదిలివస్తాం.

మనం జిల్లెళ్ళమూడిలో బహుశా, మనసు నాకట్టుకో గల రూపంతో పరిసరాల నుండి విడివడి దైనందిన చీకూ చింతలకు అతీతమైన అంతర్ముఖత్వంతో ఉన్నశక్తి సంపన్నుడయిన "యోగి"ని చూడాలని అనుకుని ఉండవచ్చు. తద్భిన్నంగా మనం పరిసరాలను సావధానంగా ఆసక్తిగా గమనిస్తున్న మాతృమూర్తిని చూస్తాం. మనం పూర్తి నిరాసక్తత, నిర్లిప్తత ఉంటుందని ఎదురు చూచినచోట అన్ని ఆచరణాత్మక సన్నివేశాలలో సంపూర్ణమైన ఆసక్తి, వానిలోని వివిధాంశాలపై ఎంతో జాగరూకత మనకు కనబడుతుంది. పచ్చియోగ విభూతులు దర్శనం కాక అణకువలో వికసించిన అలవికాని మృదురీతిని అమ్మయందు మనం అనుభవిస్తాం. సాధారణంగా ఈ మాటతో చెలామణి అయ్యే తన్ను తాను కించపరచుకొనే స్వభావం కాక ఎవరినైనా దేనినైనా చిన్నచూపు చూడటానికి వ్యతిరేకించే అణకువ ఇది. పిచ్చివాడు కాని, పసివాడుకాని, మంత్రికాని, దారినపోయే కుక్కగాని అందరిపైనా ఒకేదృష్టి జరిపే చైతన్య స్రవంతి మీద అమ్మకు గల ఆదరమే దీనికి కారణం. అందరినీ ఒకే విధమయిన ప్రేమతో ఆదరంతో చూస్తుంది, తనను అందరిలో చూస్తున్నది కనుక.



భారంవహించే శక్తి ఎక్కడి ఉన్నదో అక్కడే మాతృత్వం. - అమ్మ

అమ్మ హృదయంలో తనకు మాత్రమే ఒక ప్రత్యేకమైన స్థానం ఉంచిందని ప్రతి వ్యక్తికి ఒక స్పష్టమైన అభిప్రాయం. వచ్చే సోదరులు అసంఖ్యాకంగా ఉన్నా ఆ అభిప్రాయం కలగడం గమనించతగ్గ విషయం. అనుపమానంగా అనుగ్రహింప బడ్డామని ఊహాలోకాల్లో ఉన్న మనకు ప్రతివాడూ అలాగే భావించడం చూచి ఆశ్చర్యపోతాం. ఒకరకంగా అమ్మదృష్టిలో మనం ప్రత్యేకం అని ఆలోచించుకోటం తప్పేంకాదు. ప్రతివాడూ తన అనుగు బిడ్డడే కనుక ప్రతి ఒక్కరమూ అమ్మకు ప్రత్యేకమే. ప్రతి ఒక్కడూ పోగొట్టుకోలేని, వదలుకోలేని విలువైన వాడే అమ్మకి.

మనకు త్వరలోనే అవగతం అవుతుంది. సర్వసాధారణంగా మనకు లభ్యమయ్యే పొగడ్తలకు లొంగేటువంటిదీ, ఎరచూపి పొందగలిగినట్టిది, స్వాధీనం చేసుకోవాలని తహ తహ లాడేది, చూపించిన ప్రేమకు ప్రతిఫలాపేక్ష కోరేది అయిన ప్రేమకాదు అమ్మది. తద్భిన్నంగా అమ్మ చూపే ప్రేమలో ఏమాత్రం బలవంతంగాని, బంధంగాని కనబడదు. అది పూర్ణంగా స్వతంత్రమైనది. పొందేవాడిని కూడా స్వతంత్రంగానే వదలుతుంది.

తన కిరణ ప్రసారం పొందేందుకు పచ్చటి చెట్లన్నీ విచ్చుకొని తన కిరణోన్ముఖం కావాలని సూర్యుడు వత్తిడి చేయనట్లే అమ్మ ప్రేమ కూడా మనకు ఇష్టమైతే స్వీకరించవచ్చు. లేకపోతే తిరస్కరించవచ్చు - అనే స్వేచ్ఛలోనే మనలను ఉంచుతుంది. బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టు పైనగాని, గడ్డిపరకమీదగాని వివక్షత లేకుండా సూర్యకిరణాలు ప్రసరిస్తూనే ఉంటాయి. ప్రతి మొక్క తాను ఓపినంత శక్తినే తీసుకుని తన స్వభావానికి అనుగుణమైన రీతిలో పెరగటానికి ఆశక్తిని ఉపయోగించుకొంటాయి. స్వీకరించేవాడి అవసరాలకి అనుగుణంగానే ప్రేమ ఆదరింపబడి స్వీయగతమౌతుంది.

అమ్మప్రేమలో లక్ష్యంలేదు. దానిదైన పధకం లేదు. ప్రేమించడంలోని ఆనందం కోసమే - ప్రేమించకుండా ఉండలేదు కనుక ఆ ప్రేమకు ఫలితాలను గూర్చిగాని, ఘన విషయాలను గూర్చికాని లెఖ్ఖలేదు. విజయ పరాజయాలకు గుణదోషాలకు జమాఖర్చులకు కోట్ల యోజనముల కావల ఉన్నది ఈతల్లిప్రేమ. పరిస్థితులను మార్చాలనే అసహనం లేదు దానిలో - ఎందుకంటే అన్నీ శాశ్వతంగా పూర్ణమైనవేనని



తనకు తాను మెప్పించుకున్నప్పుడే ప్రపంచాన్ని మెప్పిస్తున్నా ననుకుంటాడు. - అమ్మ

తనకు గుర్తేకనుక. కాని చిత్రం ఏమిటంటే మార్పుతేవటంలో ప్రేమకు ఉన్న శక్తి మరి దేనికీలేదు.

తన పరమమైన ఇచ్ఛతో ఆప్రేమ మార్పు చేయలేనిదేమీలేదు. చర్మచక్షువులకి పనిచేయనట్లు తోచినా ప్రేమలో లవలేశం చాలు ప్రపంచాలు తుదిదాకా పరిభ్రమించడానికి.

అమ్మ తనమంచం మీద ప్రశాంతంగా కూర్చుంటుంది. అమ్మ ఏమీ చేస్తున్నట్లు కనబడదు. తను ఉండేగది, దాని ఆవరణ దాటడం అరుదు. జిల్లెళ్ళమూడి అసలు వదలదు. పుస్తకాలు వ్రాయదు. ఉపన్యాసాలు ఇవ్వదు. గంటల తరబడి తన మంచం మీద మౌనంగానో తనను పూజించుకునేందుకు భక్తిప్రపత్తులు ప్రకటించు కొనేందుకు బారులు తీరే ప్రజలతో ఇష్టాగోష్ఠి మాట్లాడుతూనో ఉంటుంది. కాని ఒక అవ్యక్త ప్రభావం అసంఖ్యాకమయిన తన బిడ్డల జీవితాలలో రూఢి అయిన పరిణామం తెస్తు తెస్తూ ఉంది. ఏదో ఒకనాడు ప్రపంచానికి కాంతినీయగల వేలాది హృదయాలలో చిన్న జ్యోతి వెలిగించబడుతున్నది.

(తెలుగు అనువాదం : శ్రీ తంగిరాల కేశవశర్మ)







అనుకున్నది తనకోసం అనుకుంటాడు అన్నది ఇతరుల కోసం అంటాడు. - అమ్మ

# అందరిల్లు

- శ్రీ ఎక్కిరాల భరద్వాజ

జీవితంలో వింత, విశేషం అనిపించిన క్షణాలన్నీ చిరస్థాయిగా మన స్మృతిపథంలో వుంటాయి. జీవితంలో జ్ఞాపకం వున్న సంఘటనలన్నీ కొంచెమో గొప్పో సామాన్యం కన్నా భిన్నంగా వున్నవేనని చెప్పాలి. బాగా విశేషంగా గోచరించే అనుభవాలన్నీ అంతకుముందు ఎంతమంది జీవితాలలోనో జరిగినా ఎవరివి వారికి ప్రత్యేకం అనిపిస్తాయి. అందుకే అత్యుత్తమ ఆధ్యాత్మికానుభూతి ప్రతిసాధకుడి జీవితంలోనూ "నభూతో న భవిష్యతి" అన్నట్లు వుంటుంది. ఎందరో మహాత్ములున్నా ఏ మహాత్ముని సన్నిధిలో వున్నవారికి ఆ మహాత్ముడే భగవత్స్వరూపుడుగా గోచరించడానికి కూడా కారణం యిదే. రమణమహర్షిని "భగవాన్" అన్నారు. రామకృష్ణ పరమహంసను "అవతారమూర్తి" అన్నారు. వారిని సామాన్యులు గుర్తించకపోయినా వారెటూ భగవత్స్వరూపులే కాని వారి సన్నిధిలోని అఖండశాంతి, ఆనందం అనుభవంలోకి వచ్చినప్పుడు వారిని దైవమని భక్తుల హృదయాలు వాటికై అవే కీర్తిస్తాయి. ఈ అనుభూతి సామాన్యంగా మానవ జీవితాలలో లభించే వింతలనూ విశేషాలనూ మించినదిగా వుంటుంది. కనుకనే సామాన్య మానవ జీవితాలను నూతన పంథాలోకి మళ్ళిస్తుంది. ఈ విశేషానుభూతుల కూడలులే ఆశ్రమాలూ, ఆవరణలూ. కాని ఏ ఆశ్రమానికి వుండే ప్రత్యేకత దానికి వున్నది. ఏ దైవకార్యం కోసం ఏ సాంఘిక పరిస్థితుల మధ్య ఏ మహాత్ముడు అవతరిస్తాడో - అందుకు తగినట్లుగానే వుంటాయి ఆ ఆవరణలూ, ఆశ్రమాలూ.

అట్లాగే జిల్లెళ్ళమూడిలో అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో నిశ్చలదృక్కులతో ఉద్భవించిన ఆవరణం కూడా చాలా ప్రత్యేకత కలది. అంతా అయినదీ, అర్థం కానిదీ, ఆద్యంతాలు లేనిదీ, ఆద్యంతాలు తానే అయినది అమ్మ అంటే. అటువంటి అమ్మ పరిమితిగా కనుపించే రూపాన్ని పరిమితమయిన మనకు గోచరింపచేయటమే మొదటి లీల. ఆమెను మనం దర్శించటం విశేషం. దాని ఫలితంగా మనలో మనకు తెలియకుండా వచ్చే పురోభివృద్ధిని గమనించ గలిగితే వింతగా తోస్తుంది. ఈమూడింటి

కూడలి జిల్లెళ్ళమూడిలోని అందరిల్లు. అమ్మను దర్శించటానికి వెళ్ళేవారికి అత్యంతాశ్చర్యకరమూ, ఆనందదాయకమూ అయినది ఆవరణం. అదే అందరిల్లు.

అమ్మను దర్శించటానికి అనేక గ్రామాలనుండి వచ్చేవారి కోసం ఏర్పాటయిన భోజనశాలతోపాటు అనేక కుటీరాలు ఏర్పరుచుకొని అక్కడే అమ్మ సన్నిధిలో నిలవవున్న వారితో యీ అందరిల్లూ ఉద్భవించి క్రమంగా వృద్ధిపొందింది. ఈనాడు అమ్మను దర్శించేవారికి ఆశ్చర్యాన్నీ ఆనందాన్నీ ఇచ్చే విశేషమేమంటే మనం మామూలుగా వ్యవహరించే ప్రపంచాన్నుంచి అనేక అంశాల్లో భిన్నంగావుండే యీ విశ్వకుటుంబం, సోదరులూ, సోదరీమణులతో ఎప్పుడూ కలకల్లాడుతూ వుంటుంది ఆవరణం. తెల్లవారుఝామున 4 గంటలకు సుప్రభాతసేవతో రోజు ఆరంభమవుతుంది. ఈ సుప్రభాతసేవలో పాల్గొనే వారిలో చాలామంది పిల్లలూ పెద్దలూ అందరూ అతిశ్రావ్యంగా భక్త్యావేశంతో ఏకకంఠంతో పాడుతారు. తరువాత ఆవరణంలో స్థిరనివాస మేర్పరుచుకున్నవారు - పిన్నలూ, పెద్దలూ - వారివారి పనుల కెడతారు. ఈపనులు సంవత్సరం పొడుగునా జరుగుతాయి. కొత్తగా వచ్చే సోదరుల వసతికోసం ఏర్పడుతున్న కట్టడాలలో రాళ్ళుమోయటం, గానుగ వెయ్యటం దగ్గర్నుంచి వ్యవసాయం పనులూ, మంచినీళ్ళు సరఫరా చేయటం, విరామ సమయంలో రాట్నాలు వడకటం, కొత్తపాటలు నేర్చుకోవటం, సంస్కృతం చదువుకోవటం దాకా వుంటాయి వాళ్ళపనులు. పొద్దున్నే అమ్మదగ్గర సెలవు తీసుకొని పెందరాళే వెళ్ళిపోయే వారికోసం ఉదయం 9 గంటలకే వంటలూ వడ్డనలూ ప్రారంభమై అకాలంలో వచ్చిన వారికి సైతం రోజల్లా రాత్రి 12 గంటలదాకా జరుగుతూనే ఉంటాయి. ఈ పనులన్నీ మనలాంటి సంస్కారవంతమయిన కుటుంబాలనుంచి వచ్చినవాళ్ళే-చదువు, ధనము, సంఘు(అ) మర్యాదల గురించి లెక్కచేయక సోదర ప్రేమనూ, మాతృభక్తినీ మాత్రమే ఆలంబనగా తీసుకుని చేస్తారు. ఇందులో సగంమంది చిన్నపిల్లలూ, అందులోనూ, ఆడపిల్లలు కావటం చాలా విశేషం. కేవలం తలలు నెరిసి నిస్పృహలతో నిండి జీవిత వాస్తవాలనుంచి పారిపోయిన పిరికివాళ్ళు కారీ సోదరీ సోదరులు. సాయం సంధ్యతో సామాన్యంగా పనులు ముగుస్తాయి. ఈ విశ్వకుటుంబంలో వ్యక్తులను బంధించే సోదర ప్రేమ, ఆదరణ, అపవిత్ర భావాలతో కలుషితం కాని మనస్సులూ -కొత్తగా జిల్లెళ్ళమూడికి ప్రధమంగా వచ్చే వారిని మరో ఆదర్శ ప్రపంచానికి పరిచయం చేస్తాయి.



ఒకటి అనుకున్నప్పుడు మరొకటి జరిగితే మనల్ని మించిన దేదో ఉన్నదనిపిస్తుంది. - అమ్మ

అన్నింటికంటే కొట్టవచ్చే విషయం ఏమంటే-ఎవరూ ప్రత్యేకమయిన సాధనలంటూ ముక్కుమూసుకుని కూర్చోరు యీ ఆవరణలో, ఎవరైనా అమ్మ సన్నిధికి వచ్చిన కొత్తల్లో సాధనలను పట్టుకుపాకులాడినా కొంతకాలానికి వాటి అనావశ్యకత వారికే గోచరిస్తుంది. పాతకాలం నాటి రంగుటద్దాలలోంచి చూచేవారికి అనిపించవచ్చు వీరందరూ అంతటి దివ్యమూర్తి సన్నిధిలో వుండే అదృష్టాన్ని సాధనతో సాఫల్యాన్ని పొందే యత్నం చేయక మామూలు కార్యకలాపాలతో కాలం వృధా చేసుకుంటున్నారేమోనని. ఇటువంటి వాళ్ళలో నేనొకడిని. నాకీ విషయం గురించి ఒకసారి అమ్మ చెప్పింది - ఏ కొండల్లోకో, అడవుల్లోకో పారిపోయి అక్కడ కళ్ళూ ముక్కూ మూసుకొని ఏకాగ్రత కోసం విఫలప్రయత్నం చేయటం, సృష్టిలో సర్వ జీవకోటిలోనూ ఏర్పడివున్న స్త్రీపురుష భేదం సంబంధాల వలన తనను తప్పించుకో జూచి సహజోద్రేకాలను అణచలేక తపోభంగం పొందేకంటే యీ ఆవరణలో ఎప్పుడూ అమ్మను ప్రేమిస్తూ, అమ్మనామాన్ని స్మరిస్తూ సోదర ప్రేమలోనూ, సేవలోనూ సంపూర్ణ మానవత్వంలోని మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ, నిత్య కార్యకలాపాల్లో ఎప్పుడూ వాళ్ళ దేహాలను మగ్నంచేసే వీరి తపస్సు చాలా సుగమం, సులభం, పతనానికి తావులేనిది.... ఆ మార్గం-అని. సరి అయిన దృక్పథంతో చూస్తే సర్వత్రా విజ్ఞానాన్ని పొందవచ్చునన్నది అమ్మ విధానం. దానికి ప్రత్యక్ష తార్కాణం అవరణం. అమ్మ ప్రతిపాదించే నూతనవిధానంలో చీపురు, చేట, కత్తిపీట మొదలయిన సర్వమూ పరిపూర్ణత కోసం మానవుని హృదయంలో జరిగే అఖండ ప్రయత్నానికి సంకేతాలుగా కనిపిస్తాయి. అట్లా చూచేటట్లయితే జీవితమే సర్వసాధనల సారంగా పరిణమిస్తుంది. అమ్మ అన్నారు- మానవ జీవితమంటే సకల వేదాల సమ్మేళనమే ననీ - భక్తి, జ్ఞానం, యోగం, కర్మ - వీటిల్లో ఏదీ మరొక దాన్నుంచి భిన్నంకాదని - అన్నీ ఒకటేనని.....

అనవరతం వీరు చేసే కార్యకలాపాల్లో వారికి వ్యక్తిగతంగా ఏ ప్రతిఫలమూ ఉండదు. అమ్మ దర్శనార్థం వచ్చేవారు వీరికి కృతజ్ఞతలు అర్పించడం కూడా అరుదు. వీరు కృతజ్ఞత కర్పాలన్న స్మరణే వీరికుండదు. ఇది కర్మయోగం. అంతా అమ్మసేవయేననీ, అంతా అమ్మదేనని, అన్నీ అమ్మే చేస్తుందనీ, ఏదీ వీరిదికాదనీ - ఎప్పుడూ వీరి హృదయాల్లో నిలిచే భావమే జ్ఞానవైరాగ్యాల సారం. వీటి కాలంబనమయిన (అమ్మయందు వీరికుండే) భక్తి (ప్రేమ అంటే యింకా బాగుంటుందేమో) భక్తియోగం.



తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు. కాదు దైవం తలుస్తేనే తాను తలుస్తాడు. - అమ్మ

మనస్సు సర్వదా అమ్మయందు లగ్నం అయివుండడం యోగం. అక్కడ నిలవవున్న బిడ్డలచే యీ మార్గాలన్నిటినీ ఒకేసారి వారికి తెలియకుండానే శోధింపచేస్తున్నారు అమ్మ. చేయించటమే కాని చెప్పటం తన విధానం కాదన్న అమ్మ మాటల కొక గొప్ప వ్యాఖ్యానం ఆవరణం. ఆవరణంలో వారు పరిపూర్ణులనీ మానవాతీతులనీకాదు. మానవులు కాబట్టి సాధన అవసరం అయింది. ఆ సాధన మాత్రం అతి ఉత్తమ మయినది, అతి సులభమయినది.

అంతేకాదు - సామాన్యంగా గర్వంవలనగాని, సందేహాల వలనగాని సాధకుడు దారి తప్పటం మనం ఎక్కువగా గమనిస్తుంటాం. సరిగ్గా తాను దారితప్పేటప్పుడు తన పతనాన్ని ఆరంభంలోనే తనకు సూచించే విధానం ఏదీ లేదు. అందుకనే పతనాన్ని అరికట్టడం కష్టం. కాని ఆవరణ యీ సమస్యను బాగా పరిష్కరించింది. తొలిసారి ఆవరణంలో అడుగుపెట్టినపుడు అంతటా మంచి గోచరించటానికి కారణం, ప్రపంచంలోని వక్రగతులన్నిటినీ చూచి బెదిరి హృదయంలోని చీకటి కోణాల్లో దాక్కున్న సహజమయిన మంచితనాన్ని అమ్మ పవిత్ర సన్నిధీ, ఆ సాన్నిధ్యం వలన చాలా వరకూ శుద్ధిఅయిన సోదర హృదయాల ప్రభావం బహిర్గతం చేస్తుంది. తనలోని కొద్ది దైవత్వం తొంగిచూడటం వలనే ఆవరణం అంతటా దైవత్వం కనిపిస్తుంది. కాని ఎక్కువ కాలం అక్కడ నిలిచాక అంతఃకరణ శుద్ధం కావటాన మనలోని కల్మషం కూడా అంతఃకరణల కవగతం అవుతుంది. నిత్యజీవితంలో మాములు ప్రపంచంలో సామాన్యంగా జరుగని పనియిది. చివరకు తనలోని లోట్లను విస్మరించి ఇతరులను విమర్శించే గుణం బహిర్గతం కావటాన అంతటా చెడు గోచరిస్తుంది. అమ్మ అంటారు - " ఈ ఆవరణలో ఉంటే కష్టాలు తొలుగుతాయి అనుకోకూడదు. బయట ప్రపంచంలో మీకేవి ఉంటాయో అవన్నీ యిక్కడా ఉంటాయి" అని. సృష్టికి మంచి ఎంత అవసరమో చెడు కూడా అంతే అవసర ముంటుంది. సృష్టిలో పనికిరానిదంటూ ఏదీ లేదంటుంది. సృష్టికి సంక్షిప్త ప్రతి ఆవరణం. కుటుంబానికి విస్తృత ప్రతి ఆవరణం. మానవుడికి ప్రతిబింబమే యీ రెండూ. అట్లాగే ఆవరణమున్నూ. తనలోని పురోగతి తిరోగతులకూ, తనలోని శాంతి వికారాలకు ప్రతి బింబాలే ఆవరణంలోని వ్యక్తులు. అదేమి చిత్రమోగాని - మనలోని

బలహీనతలన్నీ మనం ఆవరణంలో ఎదుర్కొనే సంఘటనల్లో వ్యక్తం అవుతుంటాయి. ఆవరణలోని కష్టనిష్ఠురాలను తట్టుకోలేక పోవటం కేవలం తనను తాను జయించుకునే ప్రయత్నంలో ఓడిపోవటమే. అందుకనే ఆవరణంలో కొంతకాలం గడిపితే ఆ కాలంలో ఆవరణం గురించిన అభిప్రాయం ఊసరవెల్లి రంగులు మారినట్లు మారుతుంది. ఒక్కొక్కసారి సృష్టిలోని అసహనం, అశాంతి అంతా కరడుగట్టుకొని ఆవరణంలో నిలిచాయా అనిపిస్తుంది. అదే క్షణంలో మరొకరికి భూలోకస్వర్గంగా కనపడుతుంది. అంతేకాదు - మనకు మరోక్షణంలో ఎంతోహాయిగానూ, ప్రశాంతంగానూ కనబడుతుంది. అందుకనే నాకు ఆవరణాన్ని స్కూల్ అనటం కంటే ట్రయినింగ్ క్యాంప్ అనాలనిపిస్తుంది. అయితే ఇందులో యిచ్చే ట్రయినింగ్ ఐహికానికీ ఆధ్యాత్మికానికీ కూడా దోహదంగా వుంటుంది. నిజమయిన ఆధ్యాత్మికంలో ఆధ్యాత్మికమూ, ఐహికమూ యిమిడి ఉంటాయని అమ్మ ఒకసారి చెప్పినమాట ఆవరణానికి వర్తిస్తుంది. ఒకవ్యక్తి ఆవరణంలో ఎటువంటి చిక్కుల నెదుర్కొంటాడో బయట ప్రపంచంలో అవే చిక్కులను ఎదుర్కొనవలసి వస్తున్నట్లు తోస్తుంది. అయితే ప్రాపంచిక జీవనానికి ఆవరణంలోని జీవితానికి వున్న వ్యత్యాస మేమంటే ఆవరణంలో ఉన్నంతసేపు ఎవరి లోటుపాట్లు వారికి చీకటిలో నక్షత్రాల్లా స్పష్టంగా కనిపిస్తాయి వాటిని సరిదిద్దుకోలేనివారు ఆవరణంలోంచి వారికైవారే వెళ్ళిపోతారు - అమ్మ ఉంచితే తప్ప వారు వెళ్ళిపోవటంలో కనిపించే కారణానికి వారి వ్యక్తిత్వంలోని ప్రధాన బలహీనతకు దగ్గర సంబంధం వుంటుంది.

ఆవరణలో కొట్టవచ్చేటట్లు కనిపించేది ఆవరణ నిర్వహణలోని లోటుపాట్లు ఇనుప సంకెళ్ళలా అందులో నివసించే వారిని కట్టివేసే నిర్బంధాలేమీ లేవు. ఏపనీ చేయకుండా వృథా కాలక్షేపంచేసేవారూ, బాధ్యతా రహితంగా ప్రవర్తించేవార కూడా కనపడతారు. అయితే, వారికైవారే మారటం కద్దు, ఎవరి నిర్బంధంవలన కాకుండా మారక వెళ్ళిపోవటమూ కద్దు. ఆవరణంలోని గొప్పవిశేషం ఏమంటే అక్కడ వుండే ప్రతివారిలోని లోటుపాట్లు తక్కినవారిని సక్రమంగా వుండేలా మెరుగు పెట్టేందుకు అవసరమయ్యే ఒరిపిడికి ఉపయోగించ బడుతాయి. పనికిరాని దంటు సృష్టిలో లేదంటే-ఆవరణంలో వ్యక్తుల్లోని చెడుకూడా మంచికే వినియోగించబడుతుంది

పరిపూర్ణంగా ఆవరణాన్ని ఎప్పుడూ తనదిగా చూచుకొని దానిని సద్వినియోగం చేసుకోగలవాడికి యావత్ సృష్టి సొంత యిల్లే అయితీరుతుంది. రెండవది ఎంతకష్టమో, మొదటిదీ అంతే. సరాసరి ప్రపంచాన్ని ఉద్ధరిద్దామని బయలుదేరేవాడికి తనను తాను వంచన చేసుకునేందుకు సావకాశం వుందేమో కాని ఆవరణంలో ఆ తావులేదు. తనమీద తనకు నిగ్రహం ఏర్పడనిదీ ఆవరణంలో ఎవరూ ప్రశాంతంగా ఎక్కువకాలం ఉండలేరు. ఇది అగ్నిపరీక్ష.

క్లుప్తంగా చెప్పాలంటే - జగత్తు. ఆవరణం, మన వ్యక్తిత్వం - యీ మూడింటికి బ్రహ్మాండ, అండాండ, పిండాండాల కుండే సంబంధమే ఉన్నది. ఒకదాని రహస్యం తెలిస్తే మరోదాని రహస్యం తెలుస్తుంది. ఒకదానిని సక్రమంగా సాధిస్తే సర్వాన్నీ సాధించవచ్చు. ఏ కట్టుబాటులూ లేని యీ ట్రయినింగ్ క్యాంపులో ఎవరి లోటుబాట్లే వారిని కట్టుబాటు చేస్తాయి. త్వరగా సక్రమంగా పూర్తిచేస్తే వారు జీవిత సమరంలో గెలిచినట్లే.



## అమ్మ

జగతికి ఆధారము ప్రేమమూర్తి అమ్మ
సుగతికి ఆధారము దివ్యజనని అమ్మ

తొలి తానై మలి తానై
మది తానై తుది తానై
అందరి హృదయాలలోన
ఎల్లవేళలా అమ్మా....

వేదనలో రోదనలో
శోధనలో సాధనలో
సంతసాన శాంతాన
సుఖదుఃఖాలన్నిటిలో అమ్మా.....

\- భాను హైమ

# "పుత్రవత్ సర్వభూతాని"

- కొండముది రామకృష్ణ

మద్రాసు నుంచి తమిళంలో వెలువడే మాసపత్రిక 'జ్ఞానభూమి' సంపాదకులు శ్రీ మలర్‌మన్నన్ జిల్లెళ్ళమూడి వచ్చారు. తమిళ పాఠకులకు అమ్మను పరిచయం చేయాలని వారి ఉద్దేశం. అమ్మను సందర్శించారు. అమ్మను గురించీ, అమ్మతత్వం గురించి గ్రంథాధ్యయనం చేశారు. అంతతో వారు సంతృప్తి పడలేదు. అమ్మతో ముఖాముఖీ సంభాషణచేసి మరింత విషయం సంగ్రహం చేయాలని అభిలషించారు.

అమ్మ అనుమతించింది.

వారెన్నో ప్రశ్నలు, సందేహాలు అభివ్యక్తం చేశారు. అన్నిటికీ అమ్మఓర్పుతో సమాధానాలు, వివరణలూ అనుగ్రహించింది.

ఆ సంభాషణలో అమ్మ తానేమీ చదువుకోలేదనీ, తెలిసి కావాలని సాధనకూడా ఏమీ చేయలేదని వివరించింది. అప్పుడు వారు అడిగారు 'అమ్మా-లోకంలో అందరిని బిడ్డలుగా చూసే ఈవిధానం పూర్వం ఎక్కడనూ కనపడదు. ఏ గ్రంథాలలోనూ ఉన్నట్లు లేదు. మీరేమీ సాధన చేయలేదంటున్నారు. మరి మీకు ఈ భావం ఎట్లా వచ్చింది? ఎక్కడ నుండి వచ్చింది?' అని.

అందుకు అమ్మ మౌనమే సమాధానం

మన్నన్ మళ్ళీ మళ్ళీ అడిగారు

"ఏమో నాన్నా - నాకేమీ తెలీదు. ఏ శాస్త్రం చదివీ ఆ భావం నేను పొందలేదు. ఏ సాధనచేసీ ఆ భావం నేను సంపాదించలేదు".

"ఇంత గొప్పభావం, ఇంత అద్భుతమయిన ఆలోచన మీకు మాత్రమే ఎట్లా కలిగింది? మీకు ఈభావం ఎప్పటి నుంచీ ఉందమ్మా?".

"చిన్నప్పటి నుంచి సహజంగానే ఉంది. చిన్నప్పటి నుంచి నాకు ఎవరిని చూసినా నాబిడ్డ అనే అనిపిస్తుంది. ఎక్కడో పుట్టారు, ఎవరో కన్నారు. ఇక్కడకు వచ్చారు అనిపించదు. మిమ్మల్నందరినీ నేను కన్నాను. మీ మీ తల్లులకు పెంపుడిచ్చాను - అనిపిస్తుంది".



ఇచ్చినదే సంస్కారం తెచ్చుకున్నది కాదు. - అమ్మ

అమ్మ వెలువరించే భావరసగంగలో మన్నన్ తల మునకలైనారు. తన్మయులైనారు. వారి ఆశ్చర్యానికీ ఆనందానికీ అవధుల్లేవు.

ఆ సంభాషణను ఆలకిస్తున్న నాకు అమ్మ బాల్యంలోని ఒక సంఘటన స్మృతిపథంలో మెదిలింది.

అమ్మ చినతాతగారయిన శ్రీ చంద్రమౌళి చిదంబరరావుగారు అమ్మను తన నిజస్థితిని వివరించమని అర్థిస్తూ "తెలుసుకుని విశ్వాసంతో నా వికారం పోగొట్టుకుంటా నమ్మా" అన్నారు. అప్పుడు అమ్మ " వికారం వల్లనే ఆకారం వచ్చింది తాతగారూ! అందువల్ల ఆకారం ఉన్నంతవరకూ వికారం ఉంటూనే ఉంటుంది" అనగానే తాతగారూ "అమ్మా - ఈ అపూర్వమయిన భావాలు నీకెక్కడ నుంచి వచ్చాయి? ఏ సాధన, ఏ తపస్సు చేసి ఈ జ్ఞానాన్ని సంపాదించావు? పూర్వం ఏఋషులూ, ఏ తపస్వులూ కూడ ఈ మాట చెప్పలేదు" అని ప్రస్తుతించారు.

నిజమే - మన భారతీయ ఋషులు ఎంతెంతో సాధనచేసి, తీవ్రమయిన తపస్సుచేసి అపారమయిన ఆధ్యాత్మిక శక్తిని సంపాదించి, అద్భుతమయిన అపూర్వమయిన దర్శనాలనూ శ్రుతులనూ పొంది ఆ పరమ సత్యాన్నే లోకానికి ఉద్బోధించారు.

అవే వేదాలయినాయి. వేదాంగాలయినాయి. వేదాంతాలయినాయి.

ఈ వేదవేదాంగాలే మానవునికి కావలసిన సర్వ విజ్ఞానాన్నీ కూలంకషంగా అందించాయి. సృష్టిని గురించి, సృష్టికర్త గురించి తెలిపాయి. జీవుణ్ణి గురించి ప్రవచించాయి. మానవజీవన విధానాన్ని గురించి ప్రబోధించాయి. మానవ జీవిత లక్ష్యాన్ని నిర్దేశించాయి.

భారతీయ ఋషుల ఆలోచనాలతాంతం, తపఃఫలం అయిన హైందవవేదాంతసారం - 'జీవబ్రహ్మైక్యానుసంధానమే' మానవ జీవిత పరమ గమ్యంగా అభివర్ణించింది, ఉద్ఘాటించింది.

ఆ పరమస్థితికి చరమ గమ్యానికి ఉన్నతోన్నత సాధనా మార్గమే 'ఆత్మవత్ సర్వభూతాని'. సర్వభూతాలను తనవలెనే చూడమని మన వేదాంతం ప్రబోధిస్తున్నది. సర్వభూతాలు ఒక దానికంటే మరొకటి ఏమాత్రం భిన్నంకావని మన వేదాంతం



నేర్పుగల ఓర్పు కాదు సహజమైన ఓర్పు కావాలి. - అమ్మ

ఉద్ఘోషిస్తున్నది. భాగవతంలో పోతన లలిత మర్యాదుడయిన ప్రహ్లాదుని గురించి అభివర్ణిస్తూ – "తనయందు, అఖిల భూతములందు నొకభంగి సమహితత్వంబున జరగువాడు" అన్నాడు. అదే ఉత్తమపురుషుని ఉత్కృష్టలక్షణమని పోతన భావన.

ఈసత్యాన్ని అమ్మ కాదనడం లేదు.

కాని – ఈ ప్రవచనం కంటే అమ్మ నిరంతరం తన మాటద్వారా, చేతద్వారా మనకు అందిస్తున్న అనుభూతం చేస్తున్న మరో మహత్తర ప్రబోధం ఉన్నది. అదే సర్వమాతృభావన. యావత్ విశ్వం యెడల చరాచర భేద రహితంగా "నేను అమ్మను మీరు బిడ్డలు" అనే పరమోత్కృష్ట మధురాతి మధుర మహాభావన!

ఇంతవరకు లోకంలో ఎందరో మహానుభావులు, ఋషిపుంగవులు, యోగీశ్వరులు.

"అహం బ్రహ్మాస్మి" – అని సంభావన చేయగలిగారు.

"తత్త్వమసి" – అని ఉపదేశం చేయగలిగారు.

"అయమాత్మా బ్రహ్మ" – అని ప్రబోధం చేయగలిగారు.

"ప్రజ్ఞానం బ్రహ్మ" – అని సత్యావిష్కరణ చేయగలిగారు.

"సర్వం ఖల్విదంబ్రహ్మ" – అని బ్రహ్మదర్శనం చేయగలిగారు.

ఆ యోగులు, ఆ ఋషులు ఆత్మసాక్షాత్కారం పొందిన తరువాత, బ్రహ్మానుభవం పొందిన తరువాత లోపలా వెలుపలా భాసించేదంతా ఒక్కటేనని తెలుసుకున్న తర్వాత ఈ కనుపించే అనైక్యతలోని ఐక్యతను గ్రహించిన తర్వాత – అంతర్ముఖులై జీవితం ముగించారు. తాము తరించారు.

బహిర్ముఖులైన వారు – సర్వజీవులను తమవలెనే చూడమని, ప్రేమించమని ప్రబోధించారు.

కాని – నేడు అమ్మ ఇస్తున్న సందేశం, చేస్తున్న ప్రబోధం ...... సర్వజీవులను మన బిడ్డలుగా చూడమనీ, మన బిడ్డలను మనం ఎట్లా ప్రేమిస్తామో అందరినీ అట్లా ప్రేమించమనీ.



లేని దాని కొరకు ఆశించేది దుఃఖము. ఉన్నది చాలనుకునేది సుఖం. – అమ్మ

అందరినీ తనవలెనే ప్రేమించడం గొప్ప విషయమే. కాని మానవుడికి, మానవుడి కేమిటి పశు పక్ష్యాదులకూ, సమస్త ప్రాణికోటికీ - తనకంటే, తనను కన్నవాళ్ళ మీదకంటే తాను కన్నవాళ్ళమీదనే మక్కువ ఎక్కువ. ఒక ముద్ద అన్నం ఉంటే - దానిని బిడ్డకు పెట్టి తల్లితాను పస్తు వుంటుంది. చూలింతగానూ, బాలింతగానూ బిడ్డకోసం తల్లిచేసే పథ్యమూ, పడే కష్టమూ, తపన, తాపత్రయమూ, త్యాగము చూస్తుంటే - తల్లికి బిడ్డ యందలి మమకారం - అర్థమవుతుంది.

మనిషికి తనకంటే ఈలోకంలో అధికమైనదీ, ప్రియతరమైనదీ, మధురతరమైనదీ మరొకటి లేదని అనుకునే విషయం యథార్థం కాదు. తనకంటే మనిషికి ప్రియమయినది తన సంతానమేనని అమ్మ ఉద్ఘాటిస్తున్నది.

అందువల్లనే సర్వసృష్టినీ "తన బిడ్డగా" చూసుకొనమని అంటే ప్రేమించమని అమ్మ నిరంతర ప్రబోధం.

"మన బిడ్డయందు ఏమి చూస్తున్నామో - అందరియందు దానిని చూడడమే బ్రహ్మస్థితిని పొందడం" అని అమ్మ ప్రవచనం.

మన బిడ్డయందు మనం ఏమి చూస్తాము? "ఆత్మావై పుత్రనామాసి' అని ఋషి వాక్కు. కాని అమ్మ అంతకంటే ఎక్కువే ఏదో చూస్తామంటున్నది. ఒక్కక్షణం మనం అమ్మ సన్నిధిలో ఆసీనులం కాగలిగితే - పొంగులువారుతూ అదేదో - పరవళ్ళు తొక్కుతూ, మనసు పులకింపచేస్తూ, పరవశింపచేస్తూ మనకు సాక్షాత్కరిస్తుంది.





వింటే విమర్శ కాని కంటే విమర్శ లేదు. - అమ్మ

# అమ్మ సాన్నిధ్యం

- తూములూరి లక్ష్మీనారాయణ

జాగృతి వారపత్రిక సంపాదకుల

రచనలద్వారా ఊహకందని వ్యక్తిత్వాలు కొన్ని ఉంటాయి. సాన్నిధ్యంలో కూర్చుంట మనవనిపిస్తాయి. అలా కూర్చుంటే కొంత కాకపోయినా కొంత అర్థంకావచ్చు అర్థంకాకపోయినా ఏదో ఆనందం, తృప్తి లభించవచ్చు. మార్గదర్శనమూ అందులో లభిస్తుంది. అలాంటి వ్యక్తిత్వాలలో ఒకరు 'మాతృశ్రీ' అని భావిస్తున్నాను.

సెలవు దొరికితే అమ్మదగ్గరకు వెళ్తున్నానని బయల్దేరే వెంకటేశ్వర్లుగారిని... అక్కడక వెళ్ళి ఏమిచేస్తారు? రోటీ ఏమిటి? ప్రోగ్రాం ఏమిటి? అంటూ స్టీరియోటైప్ ప్రశ్నల వేశాను.

ఏమి చేయడమేమిటి? అమ్మదగ్గర అలా ఉండడమే - అని జవాబు.

ఈమాటల వెనుక ఉన్న ఆయన అనుభూతి ఎన్ని రచనల ద్వారా వ్యక్తం చేయగలం అందువల్లనే రచనల కతీతమైన వ్యక్తిత్వాలలో అమ్మగారొకరు అనడం.

ఒకసారి ఒక రచయిత అమ్మ సమక్షంలో నాతో అమ్మ జీవితం వ్రాయాలనుకున్నాను ఆమే వివరాలు చెప్పటంలేదు, చూడండి - అన్నాడు.

నేను ఆయనను సమర్థిస్తూ.... ఔను, మీబోంట్లు మీ వివరాలు నలుగురి చెప్పరాయిరి. చెప్పకపోతే ఎలా తెలుస్తుంది? చెప్పితే వారూ ఆచరించి బాగుపడతార భయమో ఏమో-అన్నాను. ఒక విధమయిన చిలిపితనంతో.

కాని ఆమె ఏమైనా అంటే విందామని ఉంటుంది. అందువల్ల యీ మిత్రుని అడ్డుపెట్టుకుని.... "డాక్టరుగారు ప్రైవేటుగా ఎం. ఏ. ఫిలాసఫీ చదువుదామనుకుంటున్నారమ్మా" - అన్నాను.

"ఫిలాసఫీ చదవడమేమిటి నాన్నా?" అన్నది అమ్మ చటుక్కున.

మా పరిస్థితి మీరూహించుకోవచ్చు. నవ్వుతూ మళ్ళా "అయితే ఫిలాసఫీ అంటే ఏమిటి నాన్నా?" అన్నది.



నవ్వు సంతోషమూ కాదు. కన్నీళ్ళు దుఃఖమూ కాదు. - అమ్మ

ఏమీ జవాబివ్వకుండా ఎలా? అందువల్ల ఆమిత్రుడు 'వేదాంత' మన్నాడు.

"వేదాంతం అంటే?" మళ్ళీ ప్రశ్న.

"వేదానికి అంతం" - అన్నాడు.

"అది ఎం.ఏ.లో చెప్తారా?" అంది పకపకలాడుతూ, ఆ పకపకలోనే ఒక సందేశం విసిరింది. ఈ చదువుల కతీతమైనది వేదాంతమంటూ.

ఆ తర్వాత మళ్ళీ.... "అయితే ఏమేమి పుస్తకాలు చదివిస్తారు? రామతీర్థ వ్రాసిన ఫలానిపుస్తకాలు చదివిస్తారా? భగవద్గీత చదివిస్తారా? శంకరుడు వ్రాసిన ఫలానివి చదివిస్తారా?" అంటు ప్రశ్నలు వర్షించింది". అవన్నీ సూచనలు కాబోలు! సూటిగా ఆమె "అలాగా, మంచిది. చదివి ఎం.ఏ డిగ్రీతెచ్చుకో" మంటే పోయేదానికి ఇంత చెప్పిందాయె? ఆ చిత్రమేమిటోగాని-ఆమిత్రుడు పరీక్షకు కట్టాలంటే ఎగ్జెంప్షన్ వగైరా రాలేదు. ఆయాపుస్తకాలు చదవడమే ప్రస్తుతం ఆయనకు కర్తవ్యం అయింది.

ఆమెదొక విచిత్రతర్కం. (మనకు చేతకానిది కనుక విచిత్రం) ఆ తర్కంతో ఆమె విచిత్రమైన ప్రశ్నలు లేవదీస్తుంది. ఒకసారి ఎవరో ప్రసంగంలో 'కర్మఫలం' అన్నారు.

"అంటే ఏమిటి నాన్నా?" అని అడిగింది.

పూర్వజన్మలో చేసిన కర్మకు ఫలితం... అన్నాడాయన

"మరి పూర్వజన్మలో ఆకర్మకు కారణం! .... అంతకు పూర్వజన్మ అందామా? మరి ఆ పూర్వజన్మ..." ఇలా వెళ్ళి వెళ్ళి ఆప్రశ్నల బండి "మరి అపూర్వదశలో మన స్వరూపమేమిటి? అప్పటి స్థితి ఏమిటి? అప్పటి వాస్తవమేమిటి? .... అంటూ ఆగింది.

అయితే కర్మసిద్ధాంతాన్ని మీరు కాదంటున్నారా.... అని అడుగుదామనిపించింది కాని ఆమె మాటల మధ్య ఆ ఆలోచన ఎగిరిపోయింది.

ఆమె ఆ "అపూర్వమయిన దానిని గుర్తిస్తే మంచిదికదు నాన్నా? అది తెలిస్తే మనకంతా తెలిసినట్లే కదూ" అన్నది.

అది తెలిస్తే సత్కర్మలు సత్ఫలితాలు కాక మరేమి ఉంటాయి. ఇందు కర్మమార్గ నిరాకరణా లేదు. ఇదంతా జ్ఞానమార్గమో, కర్మమార్గమో, మరొకటోగాని ఒక



విధి వర్షం లాంటిది కొందరికి అనుకూలం, కొందరికి ప్రతికూలం. - అమ్మ

తర్కమార్గాన తీసుకువెళ్ళి ఊహకందని ఒక సత్యాన్ని గురించి ప్రశ్నించి వదిలివేసిందామె. ఇక పథికుని ఓపిక, ఇష్టము.

ఇలా చిన్న పెద్దమాటల ద్వారా వ్యక్తమయ్యే అనంత విజ్ఞానం ఎన్ని రచనల ద్వారా వ్యక్తం కాగలదు? ఎన్ని గ్రంథాలయితే మాత్రం ఆమహావిజ్ఞానాన్ని క్రోడీకరించగలవు? పైగా ఏదో వ్రాసి ఇది 'అమ్మ తత్వం' అనడం కూడా అందరికీ తగినపని కాదేమో! ఒకసారి ఒకరు ఆమెను గురించి ఏదో వ్రాశారు. ఆపుస్తకాన్ని గురించి ఏదో సంభాషణ జరుగుతోంది. ఆపుస్తకానికి 'అమ్మ అద్వైతం' అని పేరు పెడతానని అంటున్నారాయన నాతో.

అంతవరకు మౌనంగా ఉన్న అమ్మ చటుక్కున – "నా అభిప్రాయం ప్రకారం" అని కూడా ఆశీర్షిక ముందు ఉంచమని – సూచించింది. నిజం – అమ్మను గురించి ఎవరో ఒకరు వ్రాస్తే అవన్నీ ఆమెను గురించి వారి అభిప్రాయాలవుతాయేమో గాని అమ్మ సమగ్రతత్వం ఎలా కాగలదు?

అమ్మను గురించి ఎన్ని వ్యాసాలయితే మాత్రం ఆమె సాన్నిధ్యానికి ఎలా సాటికాగలవు?







ఎవరూ మనకున్న దానిని వదిలించ లేరు, లేనిదాన్ని తెచ్చిపెట్ట లేదు. – అమ్మ

# వాత్సల్య జలధి

- శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి

రెండోసారి గుంటూరు వెళ్ళేముందు ఉస్మానియా యూనివర్శిటి తెలుగు ప్రొఫెసరు బి. రామరాజు గారు నా ఆరోగ్యపరిస్థితి కనుక్కునేందుకు నాకు జాబు వ్రాస్తూ - జిల్లెళ్ళమూడి అమ్మను మీరొకసారి చూచివస్తే బాగుంటుంది - అని వ్రాసారు. ఆ మాట చూడగానే అమ్మను చూడాలని దృష్టికలిగింది. అమ్మను గురించి అదివరకు చాలారోజులనుంచి వింటున్నాను గాని వెళ్ళిచూడాలనే దృష్టి అదివరకెప్పుడూ కలగలేదు. గుంటూరుకు దగ్గరే కనుక ఒసారి వెళ్ళి అమ్మను చూడాలని అభిలాష కలిగింది. గుంటూరు వెళ్ళేము. ఈసారి మా జోగారావింట్లోనే బసచేశాము. అమ్మను చూడాలనుందోయి - అని జోగారావుతో అన్నాను. 'చూచిరండి మాస్టారు, ఆమధ్య నేనూ వెళ్ళి వచ్చాను' అన్నాడు. దానితో నాదృష్టి మరింత బలపడింది. ఈ ప్రయాణంలో మనం జిల్లెళ్ళమూడికూడా ఒకసారి వెడదామని నరసింహాచార్యులతో అదివరకే అన్నాను. 'ఎప్పుడేనా వెళ్ళాలని నేనూ అనుకుంటూనే ఉన్నాను. ఒకసారి వెళ్ళివద్దాం బాబుగారూ, మన కారుందిగదా శ్రమలేకుండా వెళ్ళిరావచ్చు' అన్నాడు.

గుంటూరు నుండి జిల్లెళ్ళమూడికి మరోఇద్దరు ముగ్గురు ఆప్తులతో బయలుదేరాము. సాయంకాలం 7 గంటలకు మా కారు జిల్లెళ్ళమూడి చేరుకుంది చేరగానే కనుక్కుంటే అమ్మ డాబాపైన ఉన్నది-అన్నారు. అక్కడికే వెళ్ళేము. పదిమంది మగవాళ్ళు ఒక వైపూ, పాతికమంది ఆడవాళ్ళు ఒకవైపూ అమ్మకు ఎదురుగా కూర్చుని ఉన్నారు. మాకు కొత్తగనుక దగ్గరగా వెళ్ళగూడదేమో అనుకుని దూరాన్నించే నమస్కరించి కూర్చున్నాము. ఆమె ఏమీ మాట్లాడలేదు. మాతోనేకాదు ఎవరితోనూ మాటలులేవు. అంతా మౌనంగానే ఉన్నారు. అట్లా ఒక అరగంట పైగా కూర్చున్నాం. అమ్మను చూస్తూవుంటే నాకు దుఃఖం పొంగిపొరలివచ్చింది. ఎందుకో తెలియదు. కళ్ళవెంట ఒకటే ధార, ఆమె నావైపు చూస్తూనేవుంది. అప్పుడు ఏదో ఒక గంట కొట్టేరు. వెంటనే ఒక్కొక్కరే లేచి అమ్మదగ్గరకు వెళ్ళి పాదాలు తాకి నమస్కరిస్తూ వెళ్ళిపోతున్నారు. అందరూ వెళ్ళేదాకా వుండి మేము లేచి దగ్గరగా వెళ్ళేము. నేను పాదాలు పట్టుకొని నమస్కరించాను.



చేతులూ చేతలూ వాడివే చేతులు నీవనుకుంటున్నావు కనుక చేతలూ నీవే అనుకుంటున్నావు - అమ్మ

"కూర్చో నాన్నా" అన్నది అమ్మ. చాలా దగ్గరగా కూర్చున్నాను. నరసింహాచార్యులు నమస్కరిస్తే అతన్నీ కూర్చోమన్నది. మాతోవచ్చిన తక్కిన వాళ్ళనూ అంతే. నలుగురమూ కూర్చున్నాము. ఆమె ఏమీ మాట్లాడలేదు. మేమూ అంతే. కొంత సేపయ్యాక పక్కకు చెయ్యిచాచింది. నిరంతరమాతృశ్రీ సన్నిధానభాగ్యశాలి రామకృష్ణ గారు నాలుగు చక్కెరకేళీపండ్లు అమ్మచేతిలో ఉంచారు. అవి నాచేతుల్లో ఉంచింది. మహానందంతో మాతృశ్రీ ప్రసాదం అందుకున్నాను. తక్కిన అందరికీ అట్లాగే ఇచ్చింది. అంతా మౌనంగానే నడుస్తోంది. కొద్ది సేపయ్యాక నాచేతిలోది ఒక అరటిపండు మళ్ళీతీసుకుంది. 'ఇదేమిటి చెప్మా ఇచ్చిన ప్రసాదం మళ్ళీ పుచ్చుకుంటోంది' అనుకున్నాను. ఆ పండు ఒలిచి ఒక ముక్క నాకీయబోయింది. మళ్ళీ రెండు చేతులూ చాచేను. చేతుల్లో ఉంచక పైకెత్తి నోటి దగ్గరకు చెయ్యి చాచింది. ఆ - అని నోరు తెరిచాను. నోట్లో ఉంచింది. నమిలి మింగడం కనిపెట్టి మళ్ళీ తరువాత ముక్క అందించింది.

అలాగే ఇచ్చినపళ్ళన్నీ తాను ఒలిచి తినిపించింది. ఎప్పుడో చిన్నప్పుడు ఏడాది రెండేళ్ళ వయస్సులో అన్నప్రాశన అయిన కొత్తల్లో కన్నతల్లి తినిపించిన గోరుముద్దలు జ్ఞాపకం లేవుగాని అప్పుడు ఇలాటి అనుభవమే - ఇలాటి తృప్తే కలిగిఉంటుంది గాబోలు అనిపించింది. ఎంత తృప్తికలిగిందో చెప్పలేను. నన్ను కన్నతల్లో నాపాలిదైవమో ఇల్లా మహావాత్సల్యంతో తినిపిస్తోందన్న తృప్తి మనసులో ఒకమూల ఉన్నా, అరే! ఈపళ్ళు జానెడు పొడవున పొతకల్లా ఉన్నాయే! ఒక్కొక్కటి వరసపెట్టి తినిపిస్తోందే! అమ్మ అనుగ్రహానికి ఆనందిస్తున్నాంగాని అజీర్ణం పట్టుకుంటుందేమో అని కొద్దిగా సంకోచం కూడా కలిగింది. ఏమయినాసరే అన్నిటికి అమ్మే ఉందని ధైర్యంతో ఆపళ్ళన్నీ అలాగే తినేశాను. నరసింహాచార్యులు వగైరాల చేతకూడా అట్లాగే తినిపించింది. ఇచ్చిన పళ్ళన్నీ చక్కగా పుచ్చుకున్నాం.

అప్పుడు నేను ఇంత చనువిచ్చిందిగదా ఒక్కమాటైనా ఆమెతో అనవద్దా అని - 'అమ్మా! మేము అమ్మదగ్గరకు ఏ పని మనస్సులో పెట్టుకుని రాలేదు. ఊరికే వచ్చాం. లోకంలో తల్లిదగ్గరకు పిల్లలు ఎందుకొస్తారో అందుకోసమొచ్చాం' అన్నాను.

"అవును నాన్నా! అమ్మ దగ్గరకు పిల్లలు రాకపోవటానికేదైనా కారణం ఉండవచ్చుగాని రావటానికి కారణమెందుకూ?" అన్నది.

ఎంత లోతైన భావం! ఎంత ముచ్చటైన మాట! అనిపించింది.

అదివరకే వెనకనుంచి ఎవరో "అయ్యా! శనివారంగదా ఈ రాత్రి తమకు ఫలహారమా, భోజనమా" అని మమ్మల్ని అడిగివెళ్ళేరు. ఆ ఏర్పాట్లు వాటిదారి నవి క్రింద జరుగుతున్నాయి.

తరువాత అమ్మ "నాన్నా! చాలాసేపై కూర్చున్నావు, శ్రమగా ఉందా?" అని అడిగింది.

'అమ్మసన్నిధిని కూర్చోవడం గనుక ఎంతసేపు కూర్చున్నా శ్రమగా లేదు' అన్నాను.

అమ్మ ఎవరివైపో చూచి "చూడూ! యీ నాన్నకి శ్రమలేకుండా కాళీగది చూచి మంచమూ పక్కా దిండు అన్నీచూడు" అన్నది.

అప్పటికప్పుడే అమ్మదర్శనానికొచ్చినవాళ్ళంతా వెళ్ళిపోయి సుమారు అరగంటయింది. ఇంక మనం అట్టేసేపు వెట్టిగా అక్కడే కూర్చోవటం బాగుండదని లేచి అమ్మకు వందనంచేసి కిందికి వచ్చాం. మేము మెట్లు దిగేటప్పటికి ఎవరోవచ్చి "రండి" అని గది చూపించారు. మంచాలూ, పక్కలూ దిండ్లూ సిద్ధంగా ఉన్నాయి. నరసింహాచార్యులు వగైరాలు సాపాట్లు చేశారు.

అక్కడికి దర్శనాని కొచ్చేవారు, అక్కడే స్థిరపడిఉన్నవారు, అంతా అమ్మబిడ్డలే. అందరూ అందరికీ పరిచారకులే. అమ్మ ఆశ్రమంలో ఒక ఓరియంటల్ కాలేజీకూడా ఉన్నది. మేము వచ్చామని తెలిసి ఆ కాలేజి ప్రిన్సిపాలు రాధాకృష్ణశర్మగారూ తక్కిన కాలేజి పండితులూ అంతావచ్చి మా విషయంలో ఎంతగానో ఆదరాభిమానాలు చూపించారు. అమ్మనుగూర్చిన కబుర్లతో ఆరాత్రి ఏ ఒంటిగంటకో పరున్నాం. ఉదయం లేచేసరికి స్నానాలకు వేడినీళ్ళు వగైరా సౌకర్యాలెన్నో ఎవరెవరో కలగచేశారు. అక్కడ ఎవరు ఎవరితో చెప్పడం వల్ల ఏపని జరుగుతోందో ఎవరికి తెలియదు. అందరూ చేసేవాళ్ళేగాని చెప్పేవారు కనబడలేదు. అన్నిపనులూ చరచరా జరిగిపోతుంటాయి. ఆరాత్రి 200 మంది భోజనాలు చేశారు. వారంతా ఎక్కడెక్కడ నుంచి వచ్చారో తెలియదు. భోజనాలు కాగానే విస్తళ్ళు తీసేవారు ఒకరు. ఎంగిళ్ళు ఎత్తేవారు ఒకరు. నేల కడిగేవారు ఒకరు, తుడిచేవారు ఒకరు. ఇట్లా పనులన్నీ సర్కసులో మాదిరిగా జరిగిపోయాయి.

ఉదయం మళ్ళీ అమ్మ దర్శనం కోసం ప్రయత్నించాము. ఒంటిగంటకు అందరికీ దర్శనం ఇస్తుందనే తెలిసి వేచియున్నాము. ఆ దర్శనానికి అభిలాషపడుతూ రమారమి వందమంది కూర్చున్నాం. అమ్మ వచ్చి కుర్చీలో కూర్చుంది. శ్లోకాలు చదివేవారూ,



చూస్తే కనబడను. కనబడితే చూస్తాను. - అమ్మ

పద్యాలు చదివేవారూ, పాటలు పాడేవారూ, పూజలు చేసేవారూ రకరకాలుగా ఒక గంట సుమారు అందరూ అమ్మను సేవించారు. అమెను చూస్తున్నంతసేపూ బాహ్యదృష్టికి గాని మనోనేత్రానికి గాని మరేదీ గోచరించలేదు. అదొకవిధమైన ఆకర్షణ, అదొకరీతి తన్మయత, ఆమె ప్రేమ రూపిణి అయిన ప్రత్యక్షదేవతామూర్తి. ఆమె ఏమీ మాట్లాడలేదు. అందరినీ చూస్తోంది. ఉన్న విశేషమంతా ఆ చూపులోనే వుంది. మనతో మాట్లాడదేమీ అనిపించలేదు. మాటాడుతున్నట్లే ఉంది. ఆదరిస్తున్నట్టే ఉంది. జాలిపడుతున్నట్లు కనబడింది. బుజ్జగిస్తున్నట్లు గోచరించింది. ధైర్యం చెబుతున్నట్లు తోచింది. నోటి మాటలతో కాదు కంటి చూపులతో. ఆ చూపులో ఉన్న మహిమే ఆమెలో ఉన్న మహిమ. ఆ చూపు ప్రేమరస పూరితం. ఆమెను చూస్తుంటే చాలామందికి కన్నీటి ప్రవాహం. దానికి కారణమేమిటి? అమ్మకు దగ్గరలో ఉండలేక దూరంగా ఉండి కష్టాలు పడుతున్నామని దుఃఖమా? అవునేమో! అమ్మదర్శనం వల్ల అపారమైన తృప్తి కలిగిందన్న ఆనందమా? కావచ్చు. ఇదే అని గట్టిగా చెప్పలేము. అదొక సకల విలక్షణమైన మూలం తెలియని నూతనానుభూతి. అదొక పరమ పావన దివ్యానుభూతి. ఆ అనుభూతితో చాలసేపు తన్మయులై ఇంక ఒక్కొక్కరే లేచి మాతృశ్రీ పాదాభివందనం చేసుకుని ఒక వరుసలో వెళ్ళిపోతున్నారు. నేనుకూడా లేచి వెళ్ళి వందనం చేసి వెళ్ళిపోతున్నాను. "నాన్నా, కూర్చో" అన్నది అమ్మ. ఎంతో పొంగిపోయాను. కుర్చీని ఆనుకొని మరీ దగ్గరగా కూర్చున్నాను. నరసింహాచార్యులను కూడా అలాగే ఆగమన్నది. మాతో వచ్చిన తక్కినవారుకూడా ఆగేరు. అందరూ వెళ్ళిపోయి హాలుకాళీ అయ్యేదాకా వుండి తటాలున లేచి గదిలోకి వెళ్ళిపోయింది. ఇంక మేము వెళ్ళిపోవచ్చునని అనుకుంటుంటే సన్నిధానవర్తులు ఆగమన్నారు. మాకు తెలియలేదుగాని అది అమ్మఆజ్ఞ. బయట ఉన్నవారిలో ఎవరినో పేరుపెట్టి లోపలికి పిలిచారు. అయిదు నిమిషాలు అమ్మ మాట్లాడి వారిని పంపివేసింది. అది ప్రత్యేక దర్శనం. వెంటనే మమ్మల్ని పిలిచారు. వెళ్ళేము. అమ్మ మంచంమీద చేయివేసుకుని దగ్గరగా కూర్చున్నాను. అమ్మ నాచెయ్యిపట్టుకొని తిరగాబోర్లా తిప్పుతూ తన వేళ్ళతో నిమురుతూ అందరినీ ఎన్నో కుశల ప్రశ్నలు వేసింది. 20 నిముషాలు అలాగే కూర్చోబెట్టుకుంది. అంతసేపూ నా అరచేతిని తన చేతితో అట్లా నిమురుతూనే ఉన్నది. ఎందుకిట్లా నిమురుతోందా అనుకున్నాను. అంతకుముందు నాకు మాట సరిగా రాకుండా కంఠదోషమునో, నాలుక దోషమునో వేళ్ళద్వారా బయటికి లాగేస్తోంది కాబోలు. అది నాలో నాకనిపించింది. అదేమిటని అడక్కండి. అదోభావన-అదోనమ్మిక.



స్థితులు పొందటము కాదు. ఇవ్వటమే. - అమ్మ

నమ్మికలేకపోతే ప్రపంచమే లేదు! ఉన్నట్లు మనకనబడుతున్నదీ, ఉన్నదని మనం అనుకుంటున్నదీ, యీ ప్రపంచమంతా యీసృష్టి అంతా మన నమ్మకంపైనే ఆధారపడి ఉంది. ఆ నమ్మకంలో రకరకాల భావనలు "యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ!"

బ్రహ్మ తన సృష్టిలో అక్కడొక బొట్టూ అక్కడొక బొట్టుగా ఉన్న వాత్సల్య రసాన్ని అంతనూ పోగుచేసి ఒక్క అమ్మ హృదయంలో ఉంచినట్టున్నాడే అని తోచింది. అమ్మ సన్నిధికి వెళ్ళేటప్పటికి నా వయస్సు 74 ఏళ్ళు. ఆమె వద్ద కూర్చున్నంతసేపు నాదింత పెద్ద వయస్సని నేననుకోలేదు. 7+4=ఏళ్ళ పసివాణ్ణని నన్ను నేననుకొన్నాను. ఆమెకూడా అట్లాగే అనుకున్నట్లు తోచింది. ఆ సంతుష్టితో ఆ నిండుతనంతో అమ్మవద్ద సెలవు పుచ్చుకొని వదలలేక ఎట్లాగో తిరిగివచ్చాం. తర్వాత ఎప్పుడైనా మళ్ళీ అమ్మ దగ్గరకు వెడదామని కొన్ని మాసాలపాటు ఆమెవద్దఉండి పోదామని ఆ ప్రసన్న ప్రశాంత జీవనం కొద్దికాలమైనా లభిస్తే బాగుండునని కోరిక, అప్పుడప్పుడు కలుగుతూ ఉంటుంది. తీరేకోరికో! తీరనికోరికో!

అమ్మకు నామీద అసాధారణ వాత్సల్యం కలిగిందన్న నామనస్సంతుష్టిని మరీ ఎక్కువ చేసిన ఒక చిన్న సన్నివేశం. నాకు ప్రియశిష్యుడూ, ఆత్మీయుడూ ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసరు భద్రిరాజు కృష్ణమూర్తి ఒకప్పుడు వరంగల్లులో ఒక శుభకార్య సందర్భంలో కలిసి నన్ను పలకరిస్తూ 'మాస్టరుగారు! ఆ మధ్య మీరు అమ్మని చూడడానికి జిల్లెళ్ళమూడి వెళ్ళేరటే' అని అడిగేడు. 'అవునోయి వెళ్ళేను. నీకెట్లా తెలిసింది?' అన్నాను. 'ఈ మధ్య నేనక్కడికి కుటుంబంతో వెళ్ళేనండీ. మీరు వచ్చివెళ్ళేరని అమ్మచెప్పింది' అన్నాడు. అమ్మ చెప్పిందంటే ఆశ్చర్యపడ్డాను. ఎంతోమందిలో ఒకడుగా వెళ్ళేనే! అమ్మకు నామాట ఎట్లా జ్ఞాపకముంది? నామీద ఎంతప్రేమ కలిగిందో ఎట్లా కలిగిందో అని లోపల పొంగిపోయాను. నా మనస్తృప్తికి కృష్ణమూర్తి అప్రయత్నంగా ఎంత దోహదంచేశాడూ! అని అతనిని మనస్సులో మెచ్చుకున్నాను. పరోక్షంలో నన్నుగూర్చి ఎవరినో అడిగిన కుశల ప్రశ్నకు ఎంతగానో సంతోషించాను. అంత సన్నిహితంగా మనస్సులో పెట్టుకున్న అమ్మ దగ్గరకు అదృష్టం మళ్ళీ ఎప్పటికి పంపిస్తుందో, ఎన్నాళ్ళు అక్కడ ఉంచుతుందో!.





కాలవ నిండుగా ప్రవహిస్తున్నా దాహమయితే దిగడానికి రేవు కావాలి. – అమ్మ

# ఏడిరా నీ ఈశ్వరుడు? అంటే అమ్మను చూపిస్తాను

- శ్రీ గుడిపాటి వెంకటచ

నా ఆహ్వానాన్ని అంగీకరించి అమ్మ ఇక్కడికి వస్తారంటే భావనకు ఆ అదృష్ట అందలేదు. వచ్చింతర్వాత తెలుస్తోంది. ఎందుకు ఏ మాత్రమయిన సందేశం ఆమె యీ భూమికి అవతరించారో... జ్ఞానం, వెలుగు మరుగుపడినప్పుడెల్లా తా యీ భూమికి అవతరించి తిరిగి దానిని ప్రతిష్ఠిస్తా నన్నాడు కృష్ణుడు. అట్లానే అవతారాలు భూమికి అవతరించి తమ సందేశాన్నిప్రకటించి అవి తిర మాసిపోతుందనుకుంటూ ఉంటే తిరిగి ఇంకో అవతారాన్ని దానిని పు ప్రతిష్ఠించడానికి హృదయాలలో వెలిగించడానికి పంపిస్తూ వుంటారు.

అట్లాంటివారు రావడం చాలా అరుదు. వారు వచ్చినా వారిని గుర్తించగలగ మరీ అరుదు. గుర్తించలేని మూర్ఖులకు వారే, కనికరించి తమంతట తా దర్శనమివ్వటం మరీ అపురూపం. అట్లాంటి సంఘటన యీ నిమిషాన యీ యిం యీ భగవాన్ నడిచిన స్థలాన తిరిగి ఇంకొకసారి మన హృదయాల్లో మెలగ యీ నిమిషాన చూస్తున్నాం.

ఏడిరా - నీ ఈశ్వరుడు? - అనేకసార్లు పురాణాల్లో, నాటకాల్లో ఎన్నిసా విన్నాం ఆమాటని. కాని ఆమాటను నేను ఎన్నిసార్లో ఎదుర్కోవలసి వచ్చింది. అ రోజురోజుకు సులభమవుతోంది.

ఈరోజున అమ్మ ఎదురుగా అట్లా కూర్చుని వుంటే - ఏడిరా నీ ఈశ్వరుడు? అంటే, సమాధానం చెప్పడం చాలా సులభమైపోయింది. అమ్మను చూపిస్తాను.





ఆచరణకి ఏ మతమైన ఒకటే. - అమ్మ

# అమ్మతో నేను

- శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు

ఆ రోజుల్లో అమ్మ వంటచేసి వడ్డన చేస్తుండేది. ఒకరోజు నేను ప్రత్యక్షంగా దర్శించిన ఒక సన్నివేశం వివరిస్తాను. పదిమంది పైనే ఇంట్లో బయట నుండి వచ్చిన వారున్నారు భోజనానికి. అమ్మ కాఫీకప్పుతో బియ్యం కడిగి ఎసరులో పోసింది. "నా ఒక్కడికే చాలదు ఆ అన్నం ఇంత మందికెట్లా పెడతావమ్మా!' అని అడిగాను. అమ్మ "నీకు కావలసినంత నీవు తిను సరిపోవటం సంగతి నేను చూసుకుంటానుగా" అన్నది. నేను కడుపు నిండా తినటమే కాదు ఆ పదిమంది తృప్తిగా భోంచేశారు. ఆ కాఫీ కప్పుతో పెట్టిన బియ్యం ఇంతమందికి ఎట్లా సరిపోయిందో ఆశ్చర్యం వేసింది.

ఒక దసరాలలో బామ్మ అమ్మచేత కలశం పెట్టించి పూజలు చేయించింది. అమ్మ రాజరాజేశ్వరీ అష్టకం చదువుతున్నపుడు నేను విన్నాను. అమ్మ కంఠంలోని ఆ మాధుర్యాన్ని అనుభవించవలసిందే కాని మాటలలో చెప్పలేము. ఆరోజుల్లో రాజు బావ మంత్రపుష్పం చదివేవాడు.

మా లోకనాథం బాబాయి అప్పికట్లలో ఉండేవాడు. మేమూ అప్పికట్లలో చదువుకుండేవాళ్ళం. అమ్మ అప్పికట్లకు బయలుదేరింది. నేను కూడా అమ్మవెంట ఉన్నాను. రెడ్డి సుబ్బయ్యకూడా మావెంట వచ్చాడు. పంట కాలువ దాటాలి. రెడ్డి సుబ్బయ్య బలవంతుడు. అమ్మతో " నేనెత్తుకొని దాటిస్తాలే - అమ్మా" అని అమ్మను ఎత్తుకోవటానికి ప్రయత్నించాడు. అతనివల్ల కాలేదు అమ్మను ఎత్తటం. "ఏంటమ్మా! నిన్నెత్తడం ఎంతలే అనుకున్నాను. ఇంతబరువెక్కావేంటి? నేనెత్తలేకపోతున్నాను" అని అమ్మను అడిగితే "తేలిగ్గానే ఎత్తుకొని దాటిస్తానన్నావుగా?" అని నవ్వి "ఇపుడు ప్రయత్నించు" అన్నది. ఈసారి సుబ్బయ్య ఎత్తుకుంటే బెండుకన్నా తేలికగా, అవలీలగా ఎత్తుకొని దాటించాడు. అణిమా గరిమా లఘిమా వంటి అష్టసిద్ధులు అమ్మకు వశమై ఉండవచ్చు అని అనిపించింది.

ఆరోజుల్లో అమ్మ ప్రసాదంగా అందరికీ పుట్టమట్టి పెట్టేది. అది ఎంతో సువాసనలతో మధురంగా రుచి కలిగి ఉండేది. కొమ్మూరు డాక్టర్ సీతాచలం గారి ఇంట్లో ఒక

మూల ఎలుక చచ్చినవాసన వచ్చింది. వాళ్ళంతా అమ్మవచ్చింది అన్నారు
ఈ వాసన వస్తే అమ్మ రావటమేమిటి? అని ఆశ్చర్యపోయాను. ఇంకొంతసేపు
కసువూడ్చి పోసే నెయ్యిగుంట దగ్గర సువాసనలు వచ్చాయి. అప్పుడూ అమ్మ
వచ్చిందన్నారు. అమ్మ ఆరకంగా తన రాకను గూర్చిన ఒక సూచన ఇస్తున్నట్లు
ఆరోజుల్లో నిదర్శనాలు ఉన్నాయి.

"ఎవరన్నా బిచ్చగాడిని కసిరి ఫో" అంటే అమ్మ ఆ ప్రస్తావన మా వద్ద తెచ్చేది
ఆ తరువాత అమ్మవద్దకు వెళ్ళినపుడు. అందుకని బిచ్చగాళ్ళను కసరటం, పొమ్మనటం
సామాన్యంగా చేయం. ఎందుకంటే అమ్మ ఏరూపంలో వస్తున్నదో తెలుసుకోలేక.

జిల్లెళ్ళమూడిలో మా పాకలో వెలుతురు కిరణాలు పడుతుండేవి. తాటాకులు
లేచిపోయి వెలుగు కిరణాలు పడుతున్నాయేమోనని నాన్నగారు దట్టంగా పాకను
కప్పించారు అయినా కిరణాలు పడుతూనే ఉన్నాయి ఎక్కడ నుండి అని పరీక్షగా
చూస్తే పగిలిపోయిన జాడిలో నుండి ఆ కాంతి కిరణాలు వస్తున్నాయి. అందులో
ఒక నాగేంద్రుడున్నాడు అని అందరూ ఆ తర్వాత గుర్తించారు. అది తర్వాత శ్యామ
వద్దకు వెళ్ళిందని, పండరీపూర్ వెళ్ళిందని చెప్పుకున్నారు.

1956లో అమ్మ సమాధి స్థితిలోకి వెళ్ళింది. రెండు మూడు రోజులు లేవలేదు
జబ్బనుకొని చికిత్స చేశారు. ఆఖరికి చనిపోయిందని కూడా భావించారు. చివరకు
తనంతట తనే నిద్ర నుండి మేల్కొన్నట్లుగా లేచింది. యోగానుభూతులు, యోగసిద్ధుల
చుట్టూవున్నవారికి తెలియక పోవటం వల్లఎంతో హడావిడీ జరిగింది.

నేను అమ్మచేతిమీద నా తలపెట్టి పడుకొని నిద్రపోయేవాడిని. కొంతసేపటికి
చూస్తే అమ్మ కనుపించేది కాదు. అదృశ్యమయ్యేది. బాపట్లకు వెళ్ళి వచ్చేదట
తెల్లవారేటప్పటికి మళ్ళీ నాప్రక్కనే, నాతల అమ్మ చెయ్యి మీదనే ఉండేది. ఈ
అమ్మ ఇక్కడ నుండి అక్కడకు, అక్కడి నుండి ఇక్కడకు ఒక్కొక్కసారి రెండుప్రదేశాల్లో
ఉన్న సంఘటనలున్నాయి. చిన్నప్పుడు అమ్మను వదలి ఉండలేని స్థితి ఉండేది.

అమ్మ నుండి దూరంగా ఉన్నా అమ్మ మనల్ని ప్రతిక్షణం చూస్తూనే ఉన్నది
అనేందుకు ఎన్నోసార్లు మనం ఎక్కడో మాట్లాడుకున్న సంభాషణలు యధాతథంగా
తన వద్దకు వెళ్ళినపుడు చెప్పేది.



తోచిందేదో చెయ్యి, తోచింప చేసేవాడు వాడేగా. - అమ్మ

నాది సామాన్యమైన విద్య. ఆ విద్యతో జీవితంలో స్థిరపడటం చాల కష్టం అమ్మ ప్రమేయం జీవితంలో ప్రతి సన్నివేశంలోను కన్పిస్తుంది. ఆఖరికి మా అబ్బాయి ఎస్.ఎస్.ఎల్.సి. కూడా తప్పాడమ్మా! అని చెప్పుకోవడానికీ, సాదా గ్రాడ్యుయేట్ అయిన నాకు ఆర్.టి.సి.లో శేషగిరిరావు అన్నయ్య ఉద్యోగం ఇప్పించినా, పోలిశెట్టి కుమారస్వామి బంధువులు శివరావు గారి ద్వారా స్టేట్‌బ్యాంకులో తాత్కాలిక ఉద్యోగము వచ్చినా అన్ని జిల్లెళ్ళమూడి కరణం గారి కుమారునిగా, నా చదువుతో, నా ఊహకందని విషయాలు. నా జీవితం నిజంగానేను జీవించడం లేదు. నా ఆదాయానికి నా ఇంటి ఖర్చుకు సంబంధం లేదు. అంతా అమ్మ ప్రమేయంతోనే జరుగుతున్నదని అడుగడుగునా ప్రస్ఫుటమౌతూనే ఉన్నది. ఇది ఒక సామాన్య ఉద్యోగికి సాధ్యమయ్యే పనికాదు. భౌతికంగా కూడా అమ్మవల్లనే నా జీవితం, నాజీవనం నడుస్తున్నది. అవసరాలన్నీ అమ్మ తీరుస్తున్నది. డబ్బు ఎలా సమకూరుతున్నదో తెలుస్తున్నా, ఆ రావటం వెనుక అమ్మ అదృశ్య హస్తం వున్నది.

ఒకసారి కేశవశర్మ గారు నేను మన్నవ వెళదాం అనుకున్నాం. నేను నా శారీరక పరిస్థితుల దృష్ట్యా ప్రయాణ సౌలభ్యం దృష్ట్యా, చిన్నకారు మీద వెళ్దాం అన్నాను. చిన్నకారుకు అంతఖర్చు పెట్టటం, నా చేత పెట్టించడం ఆయనకు ఇష్టంలేదు. "ఎందుకు బస్సుమీద వెళదాం, ఊళ్ళోకి బస్సులున్నవి కదా!" అన్నాడు. వెళ్ళేటపుడు ఫరవాలేదు. వచ్చేటపుడు ఇబ్బంది, పైగా ప్రయాణం మన చేతుల్లో మనం అనుకున్నపుడు ఉండదు అన్నా వినిపించుకోలేదు. బస్సులో వెళ్ళాం మన్నవకు. కానీ అమ్మ మా మనస్సు గ్రహించిందేమో ఎవ్వరమూ అనుకోకుండా పూర్ణచంద్రరావు కారు వేసుకొని తనపని మీద మన్నవకు వచ్చాడు. మమ్మల్ని అందులో ప్రయాణింపచేశాడు. అమ్మచేసే వసతులు అలా ఉంటాయి. ఇది ఒక ఉదాహరణగా మాత్రమే మీ ముందుంచాను.

అమ్మ మనల్ని దగ్గరకు తీసుకున్నంతగా మనం అమ్మదగ్గరకు పోలేకపోయామేమో! అనిపిస్తుంటుంది. అమ్మ విశ్వజననీత్వాన్ని ఏనాడూ వద్దనుకోలేదు. అది తనూభవులమైన మాకు అడ్డు అని కూడా అనుకోలేదు. అమ్మను దైవంగా చూడాలి. చనువు ఇచ్చింది కదా! అని తేలికగా చూడరాదనేదే నా సిద్ధాంతం మొదటి నుండీ. అమ్మే నాకోసం గాయత్రీ భవనం ఎదురుగా ఉన్న ఇంటి పై మొదటి అంతస్తు కట్టించింది. క్యూరింగ్



అవకాశాన్ని గమనించటం సాధన. - అమ్మ

జరుగవలసినన్ని రోజులు పూర్తిగా జరుగలేదు. అమ్మ ఇంటికి వస్తానన్నది. నలు
రోజులు నా ఇంట్లో ఉన్నది. నన్ను మానసికంగా తన ఎడబాటును తట్టుకోవటా
తయారుచేయడానికి ఆ తంతంతా జరిపిందనుకుంటాను. నాచేత రోజూ క్రొత్తబట్ట
పెట్టించుకొని పూజ చేయించుకుంది. ప్రసన్నాంజనేయ శర్మ, కుమారశర్మల
రుద్రం చెప్పించి, అభిషేకం స్వయంగా చేసుకునే అవకాశాన్నిచ్చింది.

ఆ 40 రోజులూ ఇంట్లో అమ్మకూ అనసూయేశ్వరాలయంలోను పూజ
చేసుకున్నాను. పూర్వం అమ్మ స్నానంచేసిన నీళ్ళు పవిత్రంగా పట్టుకి
స్నానంచేసేవాళ్ళం. ఆవిధంగా మళ్ళీ ఆ 40 రోజులు స్నానంచేసే అవకాశం కల్గి
అమ్మ స్నానంచేసిన స్నానాలగదిని తర్వాత నా పూజా మందిరంగా చేసుకున్నా
అమ్మ ఉనికిని నేను అక్కడ అనుభవించేవాడిని. అమ్మ ఆలయంలో ప్రవేశిం
11వ రోజున కిరీటము, శూలము, చక్రాదులతో దర్శనం ఇచ్చింది. మధు సత్తెన
ఉద్యోగరీత్యా ఉన్న రోజులలో ఒకసారి అక్కడకు వెళ్ళాను. మానసికంగా బ
వత్తిడులలో ఉన్నాను. మేడ మీద నుండి దూకినట్లు అమ్మ తన రెండు చేతుల
నన్ను పట్టుకున్నట్లు కల వచ్చింది. ఆ తర్వాత ఎన్నడూ నేను అంత మాన
వత్తిడులకు లోను కాలేదు.

అమ్మ నాజీవితం నడిపిస్తున్నది. అమ్మ నడిపించినట్లు నడుస్తున్నాను. డా
పొట్లూరి సుబ్బారావుగారన్నట్లు సర్కస్ కంపెనీ వాడు ఎట్లా ఆడమంటే అందు
జంతువులు, మనుషులు అట్లా ఆడినట్లు అమ్మ కంపెనీలో ఆడే ఆటబొమ్మ
మనం. ఏపాత్ర చేత ఏపని నిర్దేశించిందో అమ్మ ఇచ్ఛ.

అప్పుడప్పుడనిపిస్తుంది ఏమూలో ఎవరికీ అందుబాటులో లేని చోట అ బా
బందీలకు ఆవల ఉంటే బాగుండునని. కానీ అమ్మ ఉండనివ్వదు. ఇది అమ్మ ఇ
శరీరం. అమ్మ ఇచ్చిన జీవితం. అమ్మకు అంకితమైతే అంతకన్న కావల్సిందేముం

అమ్మదయ!



# ప్రశాంత విప్లవ మహోద్యమం

-డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావు

మనిషికి మనిషికీ మధ్య అంతరాల అగాధాలు పెరిగి, మనసుకు మనసుకు మధ్య అనంతమైన అడ్డుగోడలు వెలుస్తున్న ఇరవయ్యో శతాబ్దంలో సాక్షాత్తూ దేవుడే దివినుండి భువికి దిగివస్తే ఏంచేస్తాడు? అవతారమెత్తితే ఏం సాధిస్తాడు?

అంతరాల అగాధాలను అంతంచేసి అడ్డుగోడల అవరోధాలను తొలగిస్తాడు. అంతేగదా! కాదంటారా? కాకపోతే ఆ దేవుడు దేవుడేకాదు. ఆ అవతారం అవతారమే కాదు. అంతే నంటారా? అలా అయితే అమ్మ చేస్తున్నదీ, సాధిస్తున్నదీ అక్షరాలా అదే.

అమ్మ అవతారమూర్తి అనో సాక్షాత్తూ దైవమనో చెప్పడం నా అభిమతంకాదు. ఔనేమో నాకు తెలియదు. కాదనీ నేను అనడం లేదు. నూత్నయుగారంభ సూచకమైన శుభపరిణామ ప్రత్యూష మాతృశ్రీ మందిరంలో (అందరింట్లో) దృగ్గోచరమౌతున్నది. ఆ ప్రత్యూష రోచిస్సులు అమ్మ నుండి ఆవిర్భవిస్తున్నాయి. అంతమటుకే నా భావన పరిమితం.

నాశము కాల స్వభావము. అది సృష్టి వైశిష్ట్యమే కావచ్చు. సమాజం కుళ్ళి కృశిస్తే ఏ మహానుభావుడో మహాత్ముడో మరల జీవంపోసి లోకోద్ధరణ చేయడం సృష్టి పరిణామగాథ. అనంతకాల ప్రవాహంలో శుభా శుభపరిణామాల ఆయుః ప్రమాణం అల్పాతి అల్పం. కాని అవి అలా ఒకదానివెంట మరొకటి వస్తూనే ఉంటాయి.

మరైతే ఇంతకీ ఇప్పుడు అమ్మచేసిన దేమిటి? అందులో కొత్తఏమిటి? వెనుక ఎప్పుడూ ఎవరూ సాధించని ఘనకార్యమేమిటి? మహానుభావులెందరో మానవాళిని సముద్ధరించలేదా? మానవతను, మంచి తనాన్ని పెంపొందించలేదా? లేదని కాదని అనడం లేదు. పురాణేతిహాసాల దృష్టితో చూస్తే మహర్షులు, యోగులు తమ తపస్సును, ఆధ్యాత్మిక శక్తిని ధారపోశారు. ధర్మసంస్థాపనకు యుద్ధాలు జరిగాయి. భగవంతుడు స్వయంగా, ఒకసారి కాదు రెండుసార్లు కాదు పదిసార్లు అవతారాలను దాల్చాడు.



అర్థం తెలిసి అశుద్ధానికి పూజ చేసినా, వాడికే చెందుతుంది. - అమ్మ

ప్రవక్తలు వచ్చారు, పోయారు. చారిత్రక దృష్టితో చూస్తే సంస్కర్తలు సమాజోద్ధరణ
జీవితాలను అంకితం చేశారు. మహత్తర త్యాగాలు చేశారు.

మరి అమ్మ ఏమిచేశారన్న ప్రశ్నకు ఒక్కముక్కలో సమాధానం చెప్పవలసివ
ఆమె ఒక ప్రశాంత విప్లవోద్యమాన్ని నిర్మిస్తున్నారు. ఆమాటను ఆమె చెప్పటం లే
కాని చేస్తున్నారు-చేసి చూపిస్తున్నారు ఆ మహోద్యమంలో అనేక శ్రేణులున్నా
అనేకానేక రంగాలున్నాయి. సవర్ణులు - అస్పృశ్యులు, ధనికులు - పేదలు, పాలకు
- పాలితులు, ఆస్తికులు - నాస్తికులు తిరిగి ఆస్తికులలో అనేక మతస్థు
ప్రతిమతంలో అనేక కులాలు, ఇలా విభిన్న వర్గాల మధ్య వైషమ్యాలు, వైరుధ్యాల
సమాజం చిన్నాభిన్నమైన స్థితిలో ఉన్నది. ఒక్క తెలుగుదేశంలో పరిస్థి
పరిశీలిద్దాము. కులవ్యవస్థ వెర్రితలలు వేయడం ఇంచుమించు అందరికీ అనుభవవై
విషయమే. ఒకానొక సందర్భంలో ఒక కులానిది పైచేయి కావచ్చు. కాని ఆ
కులం వారు ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట, ఏదో ఒక సందర్భం
ప్రతీకారానికి గురికాక తప్పడంలేదు. కారణాలు ప్రేరణల జోలికి మనం పోనవస
లేదు. పోవద్దు. ఒకకులం పేరుచెబితేనే మరొక కులానికి అకారణ ద్వేషం కలిగేటంత
సమాజం కుళ్ళిపోయిన పరిస్థితి మట్టుకు యదార్థం. కళ్ళకు కనబడి, అనుభవా
వస్తున్న విషయం కనుక ఇది నిర్వివాదాంశంకూడా. కులాల పరిస్థితే ఇలా ఉన్నప్పు
ఇతర తారతమ్యాల మాటేమిటి? అవి చెప్పవలసిన పనిలేదు. విభిన్నజాతు
వర్గాలమధ్య నెలకొన్న విద్వేషాలదాకా పోనవసరం లేదు. ఏక గర్భ సంజాత
మధ్య ఎటువంటి తగాదాలను చూస్తున్నాము. ఏక కుటుంబంలో ఎన్ని క
లనుకుంటున్నాము? ఎందుకిలా మనిషికి మనిషి దూరమవుతున్నాడు? మన
మనసూ ఎందుకు వికర్షించు కొంటున్నాయి? దిగజారి తుదకు సమాజం ఏ దుర్గ
వచ్చింది?

"మాతృశ్రీ జీవితమహోదధిలో తరంగాలలో" అమ్మ జీవిత చరిత్రలోని ఘట్టాల
చదువుతుంటేనేమి, జిల్లెళ్ళమూడిలోని మాతృశ్రీ మందిరం ఆవరణ చూస్తుంటేనే
సమాజానికి పట్టిన కుళ్ళును అమ్మ ఎంత చాకచక్యంగా క్షాళనం చేస్తున్న
అనిపిస్తున్నది. ఆవరణలో ఎవరిది ఏమి కులమని అడగటం నేను వినలేదు. ఒక

తెలిసినా పాటించడం నేను చూడలేదు. అగ్ర కులజులుగా పరిగణించబడేవాడు. అన్యకులస్థులకు సేవచేసి ఆ సేవలో ఆనందం, సంతృప్తి పొందటం నాకు తెలుసు. కాలు కదల్చకుండా కారులో వచ్చిన ఒక ధనిక కుటుంబాన్ని ఎంతగా ఆదరించారో, ఆ కారును నడిపిన డ్రైవరును కూడా అమ్మ అంతగానే ఆదరించడం నేను చూశాను. అమ్మ ఆదరించడమనేకాదు, అక్కడ విధానమే అంత, పద్ధతే అది. అది ఒకరు చెప్పనవసరం లేదు. దానంతట అది జరుగుతుంది.

వందలకొలది జనం బంతులు తీరి భోజనాలకు కూర్చుంటే కుల, మత, వర్గ, బేధాలనుగాని, అంతరాలు అంతస్తులను గాని పట్టించుకొనరు. వడ్డిస్తున్నవారు ఎవరని సైతం ఆలోచించరు. మాతృశ్రీ మందిరాదరణ - అనుభవం పొందిన చాలమందిని చూశాక నాకు అనిపించింది ఈ భావం జిల్లెళ్ళమూడిలో ఉండగా ఉండి, పొలిమేరలు దాటాక పోయేది కాదని, అంతరాంతరాలలో అది నాటుకుపోతుంది. వినూత్నమైన సంస్కారం కలుగుతుంది. నిజమైన సోదరభావం పెంపొందుతుంది. జిల్లెళ్ళమూడిలో పరిచయమై మళ్ళీ మరెక్కడైనా కలుసుకున్న సోదరీ సోదరులను అడగండి. అమ్మ బంధువులను చూచిన ఆనందం కలిగిందని చెబుతారో లేదో చూడండి.

అక్కడికి వెళ్ళివచ్చిన వారందరూ మాతృశ్రీ ప్రేరితమైన మమతానుబంధితులు. ఆమె సృజించిన వాత్సల్య ప్రవంతి అందరి హృదయాలను ప్లావితం చేసి అంతర్లీనంగా ప్రవహిస్తున్నది. ఆమె వెలిగించిన ప్రేమజ్యోతులు అఖండదీపాలై దిశాంతరాలకు వెలుగులను విరజిమ్ముతున్నాయి.

మాతృశ్రీ మందిరం (అందరిల్లు) అమ్మ నిర్మించుకొన్న ఒక మహాప్రయోగశాల. అక్కడ జరుగుతున్నవి ప్రాయోగిక సంస్కరణలు. ఒక్కొక్క ప్రయోగం ఫలించి ప్రశాంత విప్లవ మహోద్యమంలోని ఒక్కొక్క రంగంలో విజయ దుందుభులు మ్రోగుతుండగా నవ యుగారంభమౌతున్నది. మనసులలో మమతలు కలిగి, మనుషులలో సమతలు వెలిగి వర్గాలు లేని స్వర్గం నిర్మాణమౌతున్నది.

ప్రయోగ ఫలితాలవల్ల మానవాళి కంతటికీ మహోపయోగం జరగగలదా? నవసమాజం ప్రపంచపరీ వ్యాప్తంకాగలదా? ఏమో! అది మానవాళి అదృష్టం.



# అమ్మ సందేశం

- పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్

'సందేహనివృత్తి చేసేదే సందేశం' అన్నారు అమ్మ. అసలు సందేశం అంటే సమాచారం. అసలును గూర్చిన సమాచారం తెలిస్తే ఇక సందేహం ఎందుకుంటుంది? మనకు లోకంలో రకరకాల సందేశాలు వినిపిస్తుంటాయి. అనూచానంగా వస్తున్న గీతాసందేశం, ఉపనిషత్ సందేశం, రామాయణ సందేశం, రాష్ట్రపతి - ప్రధానమంత్రుల జన్మదినసందేశం, రాష్ట్ర అవతరణ దినోత్సవ సందేశం, స్వాతంత్ర్యదినోత్సవ సందేశం వంటివి ఎన్నో సందేశాలు వింటూనే ఉంటాం. నిజంగా ఇవి మన సందేహాలు నివృత్తి చేస్తున్నాయా? మనలో మార్పు తెస్తున్నాయా? ఏమో ఎంతవరకు తెస్తున్నాయో! ఎవరికి వారికే తెలియాలి.

అమ్మ లోకానికి ఏదైనా సందేశం ఇచ్చిందా? అని అడిగేవారు ఎంతోమంది ఉంటారు. అమ్మ "నేనూ మీలాంటి దానినే నాన్నా! ఎవరిని చూచినా తన బిడ్డలే అనిపిస్తుందనీ, వారికింత పెట్టుకోవాలని అనిపిస్తుందనీ, నేనేమీ ఘనకార్యాలు చేయటం లేదు. నా జీవితంలో ఆదర్శప్రాయంగా ఏదైనా తోస్తే స్వీకరించవచ్చు" అనేది నిజమే అమ్మజీవితం కంటే మహత్తర సందేశం ఏముంటుంది? అమ్మ ఏదైనా తన ఆచరణలో చూపించింది, అనుభవించిందే చెప్పింది. తాను మనకు ప్రేమగా ఆదరణగా అప్యాయంగా అన్నంపెట్టింది. ఇలాగే మీరు మీ ఇళ్ళల్లో కూడా పెట్టమన్నది. తాను గుడ్డలు పెట్టింది. అలాగే మన ఇళ్ళల్లో పెట్టమన్నది. శ్రద్ధ అశ్రద్ధను బట్టి కాక ఆకలి గొన్నవాడికి ధనిక పేద వ్యత్యాసం లేకుండా పెట్టమన్నది. అపుడు ప్రతి ఇల్లు అందరిల్లు లాగా ఒక జిల్లెళ్ళమూడి అవుతుందన్నది.

అమ్మ అవతరించింది మొదలు అనంతంలో కలిసిపోయే వరకు యావజ్జీవితము లోకసంగ్రహార్థమే గడిపింది. బిడ్డలను కనడమూ పోషించడమూ ఉపసంహరించడమూ ఇదే కాలక్షేపం. ఏది చేసినా బిడ్డల కోసమే - ఈ విశ్వ సంసారంకోసమే. అందుకే అమ్మ "నేను ఏం చేసినా మీ కోసమే. స్నానం చేసినా చీర కట్టుకున్నా" అని అన్నది



ఒక పెన్నిధి అందన జేరడం పెండ్లి. - అమ్మ

అమ్మ ఒక కూతురుగా తల్లిదండ్రులకు చేయవలసినది అంతా చేసింది. చివరకు తండ్రి సీతాపతితాతగారి చేత అనంత పద్మనాభునిగా పూజ చేయించుకొన్నది. అన్నగారు రాఘవరావు మామయ్య చేత పూజ చేయించుకుంది. అత్తగారు కనకమ్మ బామ్మచేత, బంధువులచేత ఒకరేమిటి చిన్నప్పుడు ఛీ కొట్టినవారి చేత నిరాదరించిన వారిచేత కూడా పూజలు చేయించుకుంది. వారికి చేయవలసిన సేవలు చేసింది. ఎందువల్ల అమ్మకు వారు పూజచేసే స్థితికి వచ్చారు అంటే అమ్మలోని అతిమానుష ప్రేమతత్వం అనుకుంటాను. అమ్మ నాకు ప్రేమ సహజం అంటుంది. ద్వేషించినవాళ్ళనూ, దుషించినవాళ్ళనూ, కొట్టినవాళ్ళనూ, తిట్టినవాళ్ళనూ అందరినీ ప్రేమించింది. సహజసిద్ధమైన సహనంతో ప్రేమతో దేన్నైనా జయించవచ్చని లోకానికి సందేశాన్ని ప్రసాదించింది.

పతిని ఆధారం చేసుకొని పంచభూతాలను జయించవచ్చని తన ఆచరణ ద్వారా నిరూపించింది. పృధివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములు ఏరకంగా అమ్మ అధీనములో ఉన్నది అమ్మ జీవిత చరిత్ర చదివినవారికి, దగ్గరగా ఉండి నిత్యచర్యలను గమనించిన వారికి తెలుసు. అంతేకాదు పతివ్రత అంటే చివరకు భర్తచేత కూడా తల్లిగా భావింపబడటమని చెప్పి ఆరకంగా నాన్నగారిచేత కూడా ఆరాధింపబడటం గమనించిన వారు లేకపోలేదు.

జిల్లెళ్ళమూడి రాకుండా జిల్లెళ్ళమూడిని గూర్చి ప్రశ్నలు వేసేవాళ్ళకు సమాధానాలు చెప్పి చెప్పి, చివరకు వారు నమ్మకపోతే 'ఒకసారి అమ్మవద్దకు రండి. మీ అనుమానాలన్నీ తీరిపోతాయి' అని చెప్పేవాళ్ళం. అలా వచ్చినవారి కెవరికైనా పండితులైనా, పామరులైనా, వితండవాదులైనా అమ్మ వాత్సల్యానికి కరిగిపోయి అమ్మ ఒడిలో వాలిపోయేవారు. ఎందుకంటే అమ్మ జీవితమే ఒక సందేశం కనుక.

అమ్మ లక్షమందికి ఒకే పంక్తిలో భోజనం పెట్టాలనే కోరిక బిడ్డలు నెరవేర్చిన తర్వాత కోటి మందికి దర్శనం ప్రసాదించటానికి ఊరూరా, వాడవాడా తిరిగింది బిడ్డల కోరికపై. అమ్మ ఎక్కడా ఉపన్యాసాలివ్వలేదు. కాని అమ్మచూపులతో అన్నం తినమన్న సంజ్ఞలతోనూ లక్షలమందిలో తృప్తిని కలిగించింది. ఏదో ఒక అనంతశక్తి



ప్రేమ కంటే ధర్మం గొప్పది. - అమ్మ

సన్నిధిలోని అద్భుత అనుభూతిని ప్రసాదించింది. దృక్ప్రసారంతోనే వా
హృదయాలలో వారందరూ అమ్మ బిడ్డలమనే సందేశాన్ని అందుకున్నారు. సర్వత్ర
అమ్మ చూపిస్తున్న అనురాగమే అమ్మ సందేశమని వారు భావించారు.

మతాన్ని గూర్చి అమ్మ "సర్వసమ్మతమైనదే నా మతం" అన్నది. "గీతకానీ
బైబిలుకానీ, ఖురానుకానీ దేనిలోనైనా ఒక విషయం గురించే చెప్పారు. ఆచరించే
వాడికి ఏదైనా ఒక్కటే. ఆచరించలేనివాడే దాన్లో ఏముంది? దీన్లో ఏముంది? అని
వెతుకుతుంటాడు. కాని చివరకు వెతుక్కోవడంతోటే సరిపోతుంది జీవితం. ఏదీ
ఆచరించలేడు. తోటి ప్రాణిని ప్రేమించమని ఒక్క బైబిల్‌లోనే చెప్పలేదుగా. అన్నింట్లో
చెప్పారు. జ్ఞానం అంటే ఏముంది? ఉన్నది ఉన్నట్లుగా అర్థం చేసుకోవడమేగా? నేను
ప్రత్యేకించి ఒక మతధర్మమంటూ ఆచరించేదేమీ లేదు. ఉన్నది ఒక్కటే అది కానిది
ఏదీలేదు. ఆ శక్తికి స్త్రీ పురుషభేదం లేదు. భగవంతుడు అంటాడు ఒకడు, సైన్సు
స్వభావం అంటే ఆధ్యాత్మికం దైవం అంటున్నది. నిరాకారుడు అంటే అన్ని ఆకారాలూ
తానైనవాడు. నిర్గుణుడు అన్నా అంతే. అన్ని గుణాలూ తానైనవాడు. ఏది జరిగినా
ఎవరుచేసినా మనంకాదు చేసేది మనల్ని నడిపించేశక్తి మరొకటి ఉన్నది అనుకోవటమే
అన్ని అమ్మ సందేశం సర్వసమ్మతమైనది. అమ్మ తరుణము, ప్రేరణ అనే రెండు
శబ్దాలు వాడుతుంది. 'తరుణం తప్పించుకుందామన్నా తప్పనిది'. 'మీ ప్రయాణం
ఎట్లాగో ప్రతిదీ అంతే. బస్సులు అందవనుకున్న సమయంలో అందుతవి.
దొరకవనుకున్న సమయంలో దొరుకుతవి. ఎక్కే యోగ్యత లేకపోతే బస్సు అందినా
ఖాళీలుండవు. ఉంటే మధ్యదారిలోనే ఎక్కించుకోవచ్చు. ఆతరుణం వస్తే ఏదీ ఆగదు.
వచ్చే తరుణం వస్తే మీరే వస్తారు జిల్లెళ్ళమూడికి. తరుణం రాకపోతే మీ ఇంటి ప్రక్కకు
వచ్చినా నన్ను చూడలేరు' అన్నది.

'ప్రేరణ అర్థంకాదు, ప్రయత్నం కనిపిస్తున్నది. ప్రేరణదైవానిది, ప్రయత్నం మనది
అనిపిస్తుంది. కాళ్ళు నడుస్తున్నవి కనుక మనమే నడుస్తున్నాం అనుకుంటాము. కాని
నడిపిస్తున్న శక్తి అర్థం కావటం లేదు. నడవాలనే సంకల్పం రావటానికి ఆధారం
ప్రేరణే. ప్రేరణ కాధారం ఏమిటి అంటే ప్రేరణే దైవం. ప్రేరణను ప్రారబ్ధం అనండి,
భగవంతుడనండి లేదా అన్నిటికీ కారణం మనమే అనండి. అంతా నేనే చేస్తున్నానని

కానీ - లేదా అంతా మనది కాదు ఏదో శక్తి చేయిస్తున్నది అని కానీ అనుకోండి. అంతేకాని కొంతనేనూ - కొంత ఏదో శక్తి చేయిస్తున్నది అనుకోవటం చిక్కే. ఇందులో ఏదో ఒకటి అనుకుంటే పర్వాలేదు. తెలిసినా తెలియకపోయినా, చూసినా చూడకపోయినా, నమ్మినా నమ్మకపోయినా ద్వంద్వాలూ ద్వంద్వాల కాధారమైన శక్తి ఒకటి ఉన్నదనీ, సర్వమూ తనే జరుపుకుంటున్నదనీ తెలుసుకోవాలి'.

"ఇందులో అన్ని జరుపుతున్నది 'అదే', ఆ శక్తే అనే విషయమే కాక, నీ చేతులు నీ చేతుల్లో లేవు, మంచి చెడులు నీవుకావు, ఎవరికి ఏరూపంగా ఇచ్చినా ఇచ్చేదొకడే. అందరికీ తలా ఒకరకంగా ఇస్తాడు. మనం అనుభవించటమే అనుభవింప చేసేది వాడే. అనే సందేశం చాలా స్పష్టంగా అమ్మ వివరించింది ఈ రెండు మాటల్లో. ఈ మాటనే మరొక రకంగా చెపుతూ 'నా చేత దైవం ఏది చేయిస్తే అది చేస్తున్నాను' అనుకో నాయనా! ఇంతకంటే సందేశం ఏముంది ఎవరికైనా" అన్నది.

కలియుగంలో 'నామస్మరణాదన్యోపాయం' అని చెపుతుంటారు పెద్దలు - నిజమే నామస్మరణ చేస్తే ఏమొస్తుంది? మోక్షమొస్తుందా? ఏమో! శంకరాచార్యుల వారు కూడా "భజగోవిందం - గోవిందం భజ మూఢమతే! సంప్రాప్తే సన్నిహితే కాలే నహినహి రక్షతి డుజ్కృం కరణే" అన్నారు. దీని తాత్పర్యం కూడా నామం చేయటం. బాధలు పోతయ్యని కాదు. కూర్చొని చేయటానికి మనసు నిలవటం లేదు కనుక ఏ పనిచేస్తున్నా అదే చేస్తుండండి. మీరు ఏనామం చేసినా ముట్టేది ఒకరికే. నామం చెయ్యటానికి అలవాటు పడ్డవాడు ఇంకొకటి చెయ్యలేడు! అన్నది. అంటే నామం చేస్తే బాధను ఓర్చుకొనే శక్తి వస్తుందనేది అమ్మ ఇచ్చిన సందేశం. అంతేకాదు నామంతో అద్వైతస్థితి పొందవచ్చునా అంటే పూర్తిగా ఏదిచేసినా అద్వైత స్థితే అన్నది అమ్మ. నామమే మననంవల్ల మంత్రం ఔతున్నది. అన్నివేళలా ఆ మంత్రాన్నే జపించి అన్నిరూపాల్లో ఆరూపాన్నే చూచినప్పుడు వాడే దైవం. వాడు దైవాన్ని చూడం కాదు ఆస్థితి కలిగినపుడు వాడే దైవం అవుతాడు. ఇంతకంటే ఇచ్చే సందేశం ఏముంటుంది? ఉపనిషత్తులు కాని మరే గ్రంథమైనా చెప్పే దింతకన్నా ఏమున్నది?



కోరికలులేని స్థితిని సంపాదించు కోవడానికి ప్రయత్నం సన్యాసం. -అమ్మ

"శరీరాన్ని విడిచి మనస్సులేదు. మనస్సుని విడిచి శరీరం లేదు. మనస్సుకు ఏకాగ్రత లేదు అనుకుంటారు మీరు. స్వభావం అంటాను నేను. మనస్సును గుర్తించటానికి భక్తి ఆధారమైంది. భక్తికి మనస్సు ఆధారమైంది. అదే మనస్సుతో మనస్సు గుర్తించడం. అన్నీ గ్రహించేది మనస్సే- మనస్సే దైవం. మనస్సును దైవంగా గుర్తించలేం కనుక ఒక రూపాన్ని ఆరాధిస్తున్నాం. రూపాన్ని ఆరాధించేవాడు తన మనస్సును ఆడించే దైవం వేరే ఉన్నాడనుకుంటాడు. దైవం లేడనేవాడు మనస్సులోనే అన్నీ ఉన్నాయి అనుకుంటాడు. ఇంకొకడు మనస్సే నేను అనుకుంటాడు". అందువల్ల అమ్మ ఇచ్చిన "అదికానిది ఏదీలేదు" అన్న సిద్ధాంతం సందేశం సర్వత్రా వర్తిస్తుంది.

"తమ బ్రతుకు తాము బ్రతకలేని అనేక విధాల బలహీనులున్నారు. తమ కాళ్ళమీద నిలబడలేని వారికి గదా కట్టు ఆసరా. వారికి తోడుపడండి. అయితే అది వారిపై జాలితో చేసే సహాయం అని అనుకోక, వారిని భగవత్ స్వరూపులుగా భావించి, వారికి సేవచేయండి. కనిపించని దేవునిపై మనసు నిలవడం లేదనీ, ఏకాగ్రత కుదరడంలేదనీ, బాధపడక, కనిపించే ఈ దేవుళ్ళను ప్రేమతో ఆరాధించండి. ఆ సేవలో కలిగే తృప్తేముక్తి. సుఖానికి మార్గం ఒకటే. ఏది చేసినా దైవం చేశాడనుకోవటమే. సుఖం తృప్తిలోనే ఉన్నది".

విశ్వహిందూపరిషత్ అధ్యక్షులు మధుకర దత్తాత్రేయ ఆప్టే అమ్మను దర్శించుకొని మాకేదన్నా సందేశం ఇమ్మని అడిగారు. అమ్మ "నీకిచ్చింది తృప్తిగా తిని, ఇతరులకు ఆదరణగా పెట్టడము, సర్వమూ దైవం చేస్తున్నాడనుకోవటమే" అన్నది.

ఈ పై విషయాలన్నీ చూస్తే అమ్మ తాను ఆచరించింది, తన అనుభవంలోనుండే ఏదైనా చెప్పింది. "ఉదార చరితానాం తు వసుధైక కుటుంబకం" అనే భావాన్ని అక్షరాల ఆచరించి మనకు ఆదర్శంగా నిలచింది. అందుకే అమ్మ జీవితమే సందేశం. అమ్మ జీవితంలోని ఏ ఘట్టమైనా, అమ్మ నోటి నుండి వచ్చిన ఏవాక్యమైనా (తోలునోరు కాదు కదా తాలుమాట రావటానికి)సందేశమే. అమ్మచూచిన చూపు సందేశం. అమ్మ నవ్విన నవ్వు సందేశం. అమ్మ కదలిక సందేశం. అమ్మే సందేశం-సందేశమే అమ్మ





లింగభేదం, రూపభేదం స్పర్శభేదం లేనివాడు సన్యాసి. - అమ్మ

# సర్వ వర్ణ స్వరూపిణి అంఆ

- డా॥ ఇలపావులూరి పాండురంగారావు

'అమ్మ' అన్న మాటలో ఎంత కమ్మదనం ఉందో అమ్మను 'అమ్మా' అని అప్యాయంగా పిలిచి ఆమెచేత గారాబంగా 'కన్నా' అనిపించుకోగలిగిన మాతృనందనులకు అర్ధమవుతుంది. తల్లి, మాత, జనని - అన్న మాటలలో చల్లదనం, నిండుదనం, తియ్యదనం ఎంతయినా వుండచ్చు. కాని 'అమ్మ' అన్నమాటలోని కమ్మదనానికి ఇవి ఏవీ సరితూగవు. అమ్మ అనేది మామూలు మాట కాదేమో అనిపిస్తుంది. అందులో ఏదో ఒక మంత్రశక్తి ఉందని తోస్తుంది. దీనికి కారణం అమ్మ అన్న మాటలో అన్ని అక్షరాలూ అక్షరాలా ఒదిగిపోవటమే. తల్లి ఒడిలో ఒదిగిపోయిన పసిపాపలాగా అకారాల మకారాల మధ్య అనువయిన అనుస్వారాన్ని అమర్చుకొని సకలాక్షర సమామ్నాయం 'అంమ' (అమ్మ) అనే మాటలో మంత్రాలమూటలా పీటవేసుకుని కూర్చున్నట్టు తోస్తుంది. ప్రత్యక్ష చక్షువులకు గోచరించని పరోక్ష పరమార్థమేదో ఈచిన్న మాటలో ధ్వనిస్తున్నట్టు స్ఫురిస్తుంది.

'అకారోవై సర్వావాక్', 'అక్షరాణాం అకారోస్మి' అన్న ఋషి వాక్యాలలో అకారం అక్షర భారతికి ఆదిగా భారతీయ వర్ణమాలకు శ్రీకారం చుట్టగా వరవర్ణినియైన వాగ్దేవికి మంగళగీతిపాడే మ-కారం మా, రమా, మంగళ దేవతాది దివ్య నామాలతో దేదీప్యమానంగా శోభించే శ్రీమాతగా సాక్షాత్కరిస్తుంది. ఇలా అకారంతో ఆరంభించి మకారంతో మంగళంపాడే అమావాస్య (అ-మ కు మధ్య నివసించే అక్షరమాత)కు మధ్య బిందువు మధ్యమావతిలోని మాధుర్యాన్ని వర్ణమాలలోని వ్యంజన పుష్టిని అందిస్తుంది. నిజానికి ఈమధ్య బిందువుకు తనదయిన ఒక ఉచ్చారణ అంటూ లేదు. బిందువు తర్వాత వచ్చే వ్యంజన వైఖరినిబట్టి బిందు ధ్వని వెలువడుతుంది. 'అంగన' లో 'ఙ్‌గా' 'అంజన' లో 'ఞ'గా, అండదండల్లో 'ణ్'గా, 'అందచందాల'లో న్‌గా ఈధ్వని వినిపిస్తుంది. 'అంమ' అనే మాటలోని అనుస్వారం ఇలాగే ప-వర్గంలోని పంచమాక్షరమయిన మకారంగా మారుతుంది 'అంమ' 'అమ్మ'గా సాక్షాత్కరిస్తుంది.



ఏది చూచినా ఎందులో నైనా ఒకే వస్తువును చూడటం ఏకాగ్రత. - అమ్మ

ఈదృష్టితో చూచినపుడు 'అంమ' (అమ్మ) అనే మాటలో సర్వవర్ణ సమామ్నాయం కనిపిస్తుంది. ఆరంభంలో అవ్యక్షరమయిన ఆకారం, చివర మంగళకరమయిన అంత్యాక్షరం మకారం, రెండింటికి మధ్య క-చ-ట-త-వలతో ఆరంభమయ్యే అయిదు వర్గాలకు పంచమాక్షర మయిన అనునాసికం అకారమకారాలను మేళవింపచేస్తుంది. నోరు పూర్తిగా తెరిస్తే అకారం పలుకుతుంది. పూర్తిగా మూస్తేగాని మకారం పలకదు. మధ్యబిందువు ముఖ వివరంతోపాటు ముక్కునుకూడా కూడగట్టుకొని వాక్కును వెలయిస్తుంది. ఇలా సర్వవర్ణ స్వరూపిణి అయిన 'అంమ' అకారంతో అవతరించి పాంచభౌతికమయిన ప్రపంచాన్ని వర్గపంచకంతో తరింపచేసి మకారంతో తన అవతారాన్ని అనంత లోకంలో లీనం చేసుకుంటుంది.

అంమను తొలిసారి చూచినప్పుడు నాకు ఆమెలో ఇలాంటి సర్వవర్ణ స్వరూపమే కనిపించింది. కాని సర్వానందమయ బిందువుగా సకల కళాకోవిదులకు సముపాస్యమయిన ఆమె ముఖారవిందాన్ని సమ్ముఖీకరించుకొని అందులో నేను సాక్షాత్కరించుకొన్న సర్వవర్ణ విలాస సరస్సునేకాక స్వర్ణవర్ణ మహార్ణవాన్ని ఆమెముందు చెప్పుకునేందుకు మరికొన్ని సంవత్సరాలు పట్టింది. ప్రథమ సందర్శనంలో నేను ఆమెను దర్శించుకున్నాను. మరుచూపులో ఆమె నన్ను మక్కువతో చేరదీసి తనను చూడగల దృక్కులను నాకు ప్రసాదించింది. ఈరెండు సన్నివేశాలకు మధ్య పదహారు శరత్తులు గడిచాయి. పదహారు సంవత్సరాల తరువాత అమ్మ పదనిధిని సేవిస్తూ నేను కూర్చుని ఉన్నప్పుడు అమ్మ నోటినుండి వెలువడిన మొట్ట మొదటిమాట 'ఉపనిషత్సుధ'. అప్పుడప్పుడే వెలువడిన 'ఇహం-పరం' ఆమె చేతులలో పెట్టగానే ఆమెకు 'ఉపనిషత్సుధ' జ్ఞాపకం వచ్చింది. నాదగ్గర ఉన్న రెండుమూడు ప్రతులలో ఒకటి ఇంటికి వెళ్ళగానే పంపుతానని చెప్పాను. పంపినట్టుగానే భావించి చిరునవ్వుతో నన్ను చేరదీసి నన్ను, నాభార్యను ఏకహారంలో చేర్చి మా మీద పూలజల్లు కురిపించిన అమ్మ వరదకరయుగం నేను ఎన్నడూ మరవలేను. అంతటితో తృప్తిపడక కమ్మని అరటిపండ్లు తన చేతులతో ఒలిచి నా నోటిలో పెడుతూ ఉంటే నాకు జన్మ జన్మాంతరాలనుంచి వేస్తున్న పిచ్చి ఆకలి క్షణంలో తీరినట్టు అనిపించింది. అవి నా

కన్నతల్లి కాలధర్మంచేసిన కష్టదినాలు. ఆసమయంలో అందరికీ అమ్మ అయిన అనసూయమ్మ తల్లి దగ్గరకు తీయటంలో నాకు ప్రపంచంలో మానవమాత్రులకు మాతృవియోగం లేదనిపించింది. తానుండగా తల్లి లేదనుకోవలసిన పనిలేదని 'అంమ' నాకానాడు అమృత హస్తాలతో ఆశీర్వదించి చెప్పింది.

ఆరోజు రథసప్తమి. ఉదయం పది పదకొండు గంటలకు అన్నగారు (రామకృష్ణగారు) నన్ను అమ్మదగ్గరకి తీసుకొని వెళ్ళారు. అర్కపురి, రథసప్తమి, రామకృష్ణ, అనసూయాదేవి-ఇవన్నీ నా మనస్సులో ఏదో ఒక నూతన మేళకర్తను సృష్టించినట్టు నాకు తోచింది. అంతగా చదువురాని ఆంధ్రవనితలు అనసూయమ్మను అనుసూర్యమ్మ అనటం ఇప్పటికీ అప్పుడప్పుడు మనం వింటుంటాం. ఈ పొరబాటులో కూడా ఏదో పరమసత్యం దాగి ఉంటుందని ఆరోజు నాకు అనిపించింది. వెంటనే వాల్మీకి చిత్రించిన అనసూయాదేవి నాకు స్ఫురించింది. సీతారాములు దండకవనంలో ప్రవేశించేముందు అత్రిమహామునిని దర్శించుకుంటారు. కాని అత్రి తనభార్య తనకు మించిన తపస్విని అని నిగర్వంగా సీతారాములకు చెప్పి ఆమె ఆశీస్సులు పొందవలసిందని రామపత్నికి సూచన చేస్తాడు. అనసూయను సమీపించి ఆమెతో సంభాషిస్తున్న సీతనుకూడా వాగ్విశారదుడయిన వాల్మీకి అనసూయగానే వ్యవహరిస్తాడు. "సాత్వేవ ముక్తా వైదేహీ త్వనసూయా నసూయయా" - అంటాడు వాల్మీకి. దేహబుద్ధిని విస్మరించిన వైదేహి అనసూయను చూడగా తానుకూడా అనసూయ అయివుండాలని ఆదికవి ఆర్షభావన. నిజానికి తన చెంతకు చేరిన సాధ్విని తనంతదాన్ని చేసే తపశ్శక్తి అనసూయాదేవిలో ఉంది. ఆనాడు రామపత్ని సేవించిన అనసూయలోవున్న ఆత్మీయత ఈనాడు నాకు రామకృష్ణ సారథ్యంలో సాక్షాత్కరించిన అనసూయమ్మలో అణువణువులో కనిపించింది.

ఆ తర్వాత కొద్దిరోజులకే అమ్మ పుట్టినరోజుకు నేను రావాలని విశాఖనుంచి కేశవశర్మగారి పిలుపు నన్ను పులకరింపచేసింది. రాజధానిలోని రాచకార్యాలు నన్ను ఎంత వెనక్కులాగినా అమ్మ దగ్గరికి వెళ్ళాలన్న ఆరాటం నన్ను సూదంటురాయిలా చైత్ర శుద్ధ ఏకాదశి (1-4-1985) నాటికి నన్ను జిల్లెళ్ళమూడి చేర్చింది. అది అమ్మ

జన్మదినోత్సవం కాదు, ఆత్మస్వరూపిణిని అవతారమూర్తిగా ఆరాధించే అర్కపుర నివాసులకు అది అపూర్వ పర్వం. ఆపర్వదినంలో అమ్మ చరణసన్నిధిని సేవించి ఆమె నాకు నేర్పిన మాటలనే ఆమెకు వినిపించే అవకాశం అమ్మ నాకు ప్రసాదించింది. ఒక్కనాటితో తీరని ఆమె వాత్సల్య రసాస్వాదనకు ఒక వారంరోజులు కావాలని నామనస్సులోని మాటను తానే వ్యక్తంచేసిన తల్లికోరిక ఎలాగయినా తీర్చాలని నేను తీర్మానం చేసుకున్నాను. కాని "న తత్ర చక్షుర్గచ్ఛతి, న వాగ్గచ్ఛతి, న మనో, న విద్మో, న విజానీమో" (కనులుచన నేరవచటకు, చనదు వాక్కు మనసు చొరరాని నెలవది, తెలియరాదు) అని మహర్షులు కీర్తించిన మహనీయ స్థితిని చేరుకున్న మన అమ్మకు మన మాటలు ఎలా చేరుతాయనేదే మన ఆరాటం. ఆమె వినాలనుకుంటే మన మాటలు ఏమూలనుంచయినా ఆమెకు వినిపిస్తాయి. మనం వినిపించాలనుకుంటే వినిపించవు. ఆమె చూడాలనుకుంటే మనం చూడగలుగుతాం. మనం చూడాలనుకుంటే ఆమె కనిపించదు.







నిజం చెప్పమని గర్జించే వారికి వారి నిజం మీదే నమ్మకం ఉండదు. - అమ్మ

# తొలి గురువు ...

-ప్రొఫెసర్. **అడపా రామకృష్ణరావు**

అమ్మ స్పష్టంగా చెప్పింది, "నేను గురువును కాను, మీరు శిష్యులు కారు, నేను మార్గదర్శిని కాను, మీరు బాటసారులు కారు, నేను అమ్మను. మీరు బిడ్డలు" అని. ఏ దేవత ఈ రూపంలో దివినుంచి భువికి దిగివచ్చిందని కొందరు చర్చించి చివరకు అమ్మనే అడిగితే, "ఎవరినైతే నేమి, అమ్మనైతే చాలదా?" అని సమాధానమిచ్చింది. మరొకప్పుడు "నాకు శిష్యులు లేరు, అందరూ శిశువులే" అనికూడా అన్నది. ఈ మాటలన్నిటివల్ల అమ్మ మాతృత్వానికే మహితస్థానాన్ని ప్రసాదించినట్టు కనిపిస్తుంది.

నిత్యం అనేకులు అమ్మను సందర్శించడానికి వస్తున్నారు. అమ్మ ముందుగా వారి భోజనం సంగతి చూసి, అటుపైన వారి కష్టసుఖాలను గురించి ఓర్పుతో విని, తన వాత్సల్యామృత తరంగాలలో వారిని సేదదీర్చడం మనం చూస్తున్నాం. అయితే దేశిరాజు రాజమ్మగారి కోరికను మన్నించి అమ్మ ఒక సందర్భంలో కొందరికి మంత్ర దీక్షను ఇచ్చినట్టుకూడా మనం విన్నాము. అంతేకాదు. ఆధ్యాత్మిక సాధనలో అవరోధాలేర్పడి అడుగులు తడబడుతున్న సందర్భాలలో సాధకులు అమ్మతో తమ చిక్కులు చెప్పుకొని ముందుదారి తెలుసుకోవడం కూడా మనకు కనిపిస్తూనేవుంది. ఈ విధంగా మాతృత్వంతోబాటు సందర్భానుసారంగా అమ్మలో గురుత్వం, మార్గదర్శకత్వంకూడా మనం చూడగలమన్నమాట. అయినప్పుడు అమ్మ "నేను గురువునుకాను..... మార్గదర్శిని కాను.........అమ్మను" అని ఎందుకు చెప్పిందనే ప్రశ్న వస్తుంది.

గురువును కూడా తండ్రితో సమానంగా భావించడం మన సంప్రదాయం, అయితే గురుశిష్య సంబంధం తల్లీ బిడ్డల సంబంధంకంటే కొంత భిన్నమైనదని మాత్రం చెప్పుకోవాలి. ఎందుచేతనంటే తల్లికి తనబిడ్డ ఎట్టివాడైనా ఆత్మీయుడే. అక్కడ యోగ్యతాయోగ్యతలతో నిమిత్తం లేదు. గురువు మాత్రం ఉపదేశం కోసం సమీపించిన వ్యక్తి గుణదోషాలను పరీక్షించి, వాడు పాత్రుడని తనకు సమ్మతమైతేనే శిష్యునిగా స్వీకరిస్తాడు. ఈమాటనే ప్రస్తావిస్తూ -



కమంగా గణించటం చేతనైతే సమాధాన మొక్కటే. - అమ్మ

గురువై శిష్యుల చేరదీయునెడ

తక్కుంచెయ్యు లెట్టున్న త

త్పరబుద్ధిం దిలకింపగా వలయు,

చెప్పందగ్గ వాడౌనొ కా

దొ రహస్యంబులు, తెల్వియుంగలదో

లేదో యంచు...."

అని దివాకర్ల తిరుపతి శాస్త్రిగారొక చాటు పద్యంలో చెప్పారు. ఉపనిషత్తులలో కూడా మనకీ సంగతి స్పష్టంగా కనిపిస్తుంది. మృత్యు రహస్యం తనకు బోధింపవలసినదని నాచికేతుడు యముణ్ణి అర్థించినప్పుడతడు లౌకిక భోగాలను, వస్తువాహనాలను, అధికారాన్ని ఇస్తానని ఆశకొలిపి యముడు నాచికేతుని పట్టుదలను సడలించడానికి ప్రయత్నిస్తాడు. వాటినన్నిటిని నాచికేతుడు తృణీకరించినప్పుడే యముడు అతడు తగిన శిష్యుడని చేరదీస్తాడు. సత్యకామజాబాలి తన తండ్రి ఎవరో తన తల్లికి కూడా తెలియదనే కఠోరసత్యాన్ని వెల్లడించడం చేతనే అతనికి గురు శుశ్రూషాభాగ్యం లభిస్తుంది. మహాభారతంలోని ఏకలవ్యుని కథకూడా ఇందుకొక ఉదాహరణం. ఏకలవ్యుడు అనర్హుడని ద్రోణుడు ధనుర్విద్య బోధించడానికి నిరాకరిస్తాడు. కాని ఏకలవ్యుడు ప్రత్యక్షంగా కార పరోక్షంగానే తనపై గురుభావన నిలిపి ధనుర్విద్యా పారంగతుడైనప్పుడు మాత్రం ద్రోణుడు నిస్సంకోచంగా గురుదక్షిణ గ్రహిస్తాడు.

ఈవిధంగా గురుశిష్య సంబంధంలో యోగ్యతా యోగ్యతల ప్రసక్తి ఉన్నది. అది నియమనిష్ఠా బద్ధమైన సంబంధం. గుణబేధ, కులబేధాల చర్చకు అక్కడ తావున్నది. కాని అమ్మకు గుణబేధంతోకాని, కులబేధంతో కాని నిమిత్తం లేదుగదా! అందుకే దేశిరాజు రాజమ్మగారు అమ్మతో "నీకు కొన్ని మంత్రాలిస్తాను. ఈ మంత్రాలన్నీ ప్రపంచానికి వెదజల్లు.......అడిగిన వారికి వారివారి తాహతుకొద్దీ ...." అని అన్నప్పుడు అమ్మ ఖండితంగా "వాళ్ళను తూచే త్రాసు నా దగ్గర లేదని" ఆమెతో చెప్పింది. అయినా ఆమె అర్థించినందున అమ్మ ఒక సందర్భంలో కొందరికి

మంత్రోపదేశం చేసింది. అది కేవలం తానా వృద్ధురాలికిచ్చిన మాట నిలుపుకోవడానికే గాని, మంత్రదీక్ష ఇవ్వడం అవసరమని కాదు. "ఉపదేశం జరిగేదేకాని చేసేదికాదు" అని అమ్మ అంటుంది. "ఉపదేశమంటే దైవసన్నిధిని చేర్చడం" అని "గుర్తు చెప్పినవాడే గురువు" అనికూడా అమ్మ అన్నది. అన్ని ఉపదేశాలకు, సాధనలకు గమ్యమే తానైనప్పుడు, గురువుచెప్పే గుర్తే తన శ్రీచచణ పద్మాలయినప్పుడు అమ్మ ప్రత్యేకించి మనకు గురుత్వం వహించి వేరుగా ఉపదేశించ వలసిన దేముంటుంది.

ఇక మార్గదర్శి సంగతి. 'మార్గదర్శి' అన్నమాటకు 'దారి చూపే వాడు' అని అర్థం. అంటే దారి చూపేవాడూ, మనకు శక్తి ఉండి ముందుకు సాగితే వెంటనడిచే వాడూ మాత్రమేకాని, మనం అశక్తులమై నడుమ నిలిచిపోయినా దరిజేర్చేవాడు మాత్రం కాదన్నమాట. మార్గదర్శికి దారి తెలియవచ్చు. వెంటవచ్చి దారి చూపవచ్చు. కాని మనం స్వశక్తిపై ఆధారపడి ముందుకు సాగుతున్నపుడే మార్గదర్శివల్ల ప్రయోజనముంటుంది. లేనినాడు మార్గదర్శిదగ్గర ఉన్నా మనం గమ్యాన్ని చేరుకోలేక పోవచ్చు. అమ్మదారి చూపడమేకాదు దయతో దరిజేర్చనూ గలదు. అందుకే అమ్మ తాను కేవలం మార్గదర్శిని కాదనడం.

గురుత్వం కంటే, మార్గదర్శకత్వం కంటే సన్నిహితమైన, మమతా మాధుర్య పూర్ణమైన మాతృత్వ సంబంధాన్ని ఏర్పరచుకొని "నేను అమ్మను, మీరు బిడ్డలు" అని అమ్మ తన నిరవధిక కరుణా వృష్టిని మనపై కురియిస్తున్నది. శిష్యుడు కఠోర నియమాలకు బద్ధుడై తన జీవయాత్ర సాగించాలి. మార్గదర్శి వెంట నడిచే బాటసారి స్వప్రయత్నం మీదనే ముందుకు సాగాలి. కాని బిడ్డ కావటంలో ఎంతో సౌలభ్యముంది. వాడెంతటి అపాత్రుడైనా తల్లివాత్సల్యం తరగదు. "కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి". లోకంలో చెడ్డ పుత్రుడుండవచ్చునుగాని చెడ్డతల్లి ఉండదుగదా! అమ్మ గనుక అడగకపోయినా అన్నం పెడుతుంది. భౌతిక క్షుద్బాధను తొలగిస్తుంది. ఆధ్యాత్మిక క్షుద్బాధనూ నివారిస్తుంది. అయినప్పుడు బిడ్డలమై ఉండడంకంటే మనం కోరదగిన స్థితి వేరే ఏముంటుంది?.

కేవలం గురువూ, మార్గదర్శీగాక అమ్మగా రావడంలో మరొక విశేషం కూడా వుంది. ఆధ్యాత్మికంగా గాక కేవలం లౌకికంగానే చూసినా, ప్రపంచంలో ఏదేశంలో,



రేకలన్నీ పువ్వులో భాగాలయినట్లే మన మందరమూ వాడిలో వాళ్లమే. – అమ్మ

ఏ జాతిలో చూసినా ప్రతి శిశువుకూ ఇల్లే మొదటి పాఠశాల. తల్లియే మొదటి గురువు కావడం మనకు కనిపిస్తుంది తల్లి బిడ్డకు బోధించడమూ ఉంటుంది. దారి చూపడమూ ఉంటుంది. అయినా బిడ్డ నడువలేకపోతే తానే చేయిపట్టుకొని, లేదా చంకనెత్తుకొని ఒడ్డు చేర్చడమూ ఉంటుంది. అడుగడుగున భయపడ నక్కరలేదు. "తల్లి రక్షణకాదు, రక్షణేతల్లి" అని అమ్మ అన్నది. పైగా శిశువు కావడంలో ఏంతో స్వేచ్ఛా, ఆనందమూ కూడా వున్నవి. అమ్మ స్వయంగా అన్నది. "అమ్మ అనుకున్న తరువాత అల్లరికీ ఉన్నది, అడగటానికీ ఉన్నది, తినటానికి ఉన్నది, పెట్టటానికీ ఉన్నది, కొట్టటానికీ ఉన్నది. అన్నింటికి ఉన్నది" అని.

అర్హతనుబట్టి అయితే ఏడవ మైలురాయి దగ్గరనే ఆగిపోవలసిన వాళ్ళమే అయినా, అమ్మ గనుక నిస్సంకోచంగా దగ్గరచేరి వాత్సల్య రసవార్ధిలో ఓలలాడ గలుగుతున్నాం. అందుకే "నేను అమ్మను, మీరు బిడ్డలు - అంతే" అని అనడంలోనే అమ్మ అనుగ్రహం పూర్తిగా వ్యక్తమవుతున్నది. నారదుడు కాబోలు ధర్మరాజుతో అంటాడు.

"జలజాతప్రభవాదులున్ మనములో
జర్చించి భాషావళిం
బలుకన్ రాని జనార్దనాహ్వయపర
బ్రహ్మంబు మీ యింటిలో
చెలియై మేనమరందియై సచివుడై
చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుడై చరించుటలు నీ
భాగ్యంబు రాజోత్తమా! "

అని. అచ్చంగా మనంకూడా అంతటి అదృష్టవంతులవే. అందుకే "అమ్మలగన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ" మన అమ్మగా అవతరించి మన లాలనపాలనల భారం తాను వహిస్తున్నది. ఇది అమ్మ అవ్యాజానుగ్రహానికి చిహ్నామంటే అందుకు సందేహం మేముంటుంది?



# ఉపనిషన్మూర్తి

- శ్రీ వి.యస్.ఆర్.మూర్తి
ఆధ్యాత్మిక శాస్త్రవేత్త, హైదరాబాద్

తే పదం వేదవిద్యాగిరోః భాషాదేశ సముద్భవాః

ఛందాంసి, సప్తస్వరాట్ తాళాన్, పంచమహాధ్వనీన్

ప్రకటయతి ఆత్మ ప్రసారేణ యత్ తత్ బీజం

పద వాక్య మానజనకం, శ్రీమాతృకే !

అద్భుత జన్మ ఎత్తిన అమ్మ ఐతరేయ ఉపనిషత్తు బోధించిన అండ,పిండ, బ్రహ్మాండధారిణి. ఆరంభమూ తానే, అంతమూ తానే! మమకార మహాకారిణి.

నూరేళ్ళుండాలి, కలసి వుండాలి, ఆవలి పెను వెలుగును అంతటా చూడాలి, చింతనచేయాలి అని వివరించిన ఈశావాస్యం అమ్మ !

'నేను నేనైన నేను' అని ప్రకటించటం, ముండకోపనిషద్వ్యాఖ్య.

అంతా ఆత్మకదలికే, ఉన్నదంతా ఆత్మే, ఇపుడే - ఇక్కడే అన్నీ పొందవలసి వున్నదన్నపుడు, అమ్మ కేన, బద్ధత్వం వదుల్చుకొని బుద్ధత్వంలోకి ప్రవేశించమని బోధించినపుడు, అమ్మ శ్వేతాశ్వతర!

లోకమంతా ప్రణవమేనని, శబ్ద నిశ్శబ్దాలు వ్యక్తావ్యక్తాలని, నామం ద్వారా నామిని పట్టుకోమని, స్మరణ వేళ నామే నిన్ను పట్టుకుంటాడన్నపుడు అమ్మ మాండూక్యం. మండోదరి. నిత్యకళ్యాణి!

'అన్నాన్ని పెంచు, పంచు, ఆపేక్షించు, ఉపేక్షించకు' అని అన్నమయ్య, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలకు మూలమైన అన్నం పరబ్రహ్మ అమ్మ స్వరూపమని నిరూపించినపుడు తైత్తిరీయం.

జ్ఞానంకోసం తీవ్రసాధన చేయాలి. ఓంకార ధ్యానంతో ఆత్మానుభూతిని పొందాలని సమాధానపరచిన ప్రశ్నోపనిషత్ అమ్మ!



లేనిది ఉన్నట్లు కనపడటం భ్రాంతి. ఉన్నది లేనట్లు కనపడటం భ్రమ. - అమ్మ

సద్విచారణలో జీవించాలని, ఉన్నదంతా మన లోపలే ఉన్నదని, మృత్యుభయాన్ని జయించాలని, మరణానికి ముందు తర్వాత సైతం మనం దేహులమని, అనంతరమూ అఖండ చిద్ఘనరసమైన 'ఆత్మ' అని ఎరుకపరచినపుడు అమ్మ కతః.

అమ్మని అమ్మ అనటమే సహజం. అనసూయ, రాజరాజేశ్వరి, జగజ్జనని, మాతృశ్రీ, విశ్వజనని... యిట్లా ఎన్ని విధాల పిలుచుకున్నా ఆమె అమ్మ! ఇల్లు, పిల్లలు, భర్త, ఇటు అటు బంధువర్గం ఇదంతా కలిపితే వ్యక్తి కుటుంబం. కుటుంబం అనగానే ఈతులు - యాతనలు, రాగాలు-రోగాలు, కలిమి-లేమి, బాధలు - బంధువులు... ఇవన్నీ తప్పవు. ఎవరూ తప్పించుకోలేరు. పిల్లలు, చదువులు, పెళ్ళిళ్ళు మళ్ళీ మళ్ళీ గుమ్మడిపాదులా విస్తరించే జీవితం. ఇటువంటి జీవితం సర్వసాధారణం. అయితే ప్రపంచంలో ఉంటూనే లోకాతీతమైన ఆత్మానుభవాన్ని పొంది, దొరకపుచ్చుకొని, నిలబెట్టుకొని, మళ్ళీ తామరాకుల నుండి జారిపడని ఆనందాంబువుగా, ముత్యంలా, మెరిసే వజ్రంలా ఘనీభవించిన ఐంద్రీ మహావిద్యా స్వరూపిణిగా, అవ్యాజ కారుణ్యమూర్తిగా, జగదానందకారిణిగా, అద్వైత భావనాకారిణిగా, అన్నమయ కోశానికి ముద్దలందించిన చిద్ఘనమణిగా, అమ్మగా, అంతాగా, అన్నీగా ఈ ప్రపంచం ఉయ్యాలై, జీవులంతా బిడ్డలై, వారి లాలకు, లాలనకు, లాలికి మూలమై, జగత్పాలినియై, జగన్మధ్యయైనది, అమ్మ! అమ్మ అంటే జిల్లెళ్ళమూడి అమ్మే !

గుంటూరుజిల్లా బాపట్లకు, సమీపం, ఆమె ఎంచుకున్న కార్యస్థలం! జిల్లెళ్ళమూడి గ్రామం. ఆశ్రమం గృహస్థాశ్రమం! ఆశ్రయం సర్వలోకాలకు !! ఎవరి అనుభవమో, మనదికాదు. మనం దక్కించుకున్నదే మనది.

అనుభవం లేకపోతే నమ్మకం కలుగదు. నమ్మకం లేని సాధన 'గంగిరెద్దు నడక, గానుగెద్దుల' ఆట వంటిది.నా 12 సంవత్సరాల వయస్సులో 'ఆమెను' మొదటిసారిగా జిల్లెళ్ళమూడిలో చూశాను. ఆమె కూచున్నచోట, మంచం! ఆమంచం చుట్టూ నలుగురైదుగురు. ఆమెను చూడటానికి అమాయకంగా, ఆతృతగా, వెళ్ళబోతున్న నన్ను ఒక పెద్దాయన, "ఇక్కడే ఉండు బాబూ! తర్వాత పంపిస్తా" అన్నాడు. ఈయన ఇంకా లోపలికి వెళ్ళకముందే "వాణ్ణి తీసుకురా, నేనే పిలుచుకున్నా" అన్న మాటలు

వినిపించినాయి. ఈ పెద్దాయన ఆశ్చర్యంగా "రా బాబూ" అంటూ లోపలికి తీసుకువెళ్ళాడు.

అదుగో ! అపుడు చూశాను ఆమెను ! మంచం మీద కూర్చున్న ఆమెను, పండగల్లో, పేరంటాల్లో పట్టుచీర కట్టుకుని, ఎప్పుడూ నవ్వుతూనే వున్న మా అమ్మమ్మలా ఉంది. పచ్చ చామంతిలాగా, పసుపు ముద్దగా కుంకుమ పువ్వులా వుంది. అమ్మమ్మ మనసులోకి రాగానే, కళ్ళవెంబడి కన్నీరు కారడం ప్రారంభం అయింది. అప్పుడామె నన్ను దగ్గరకు తీసుకుని, తన పక్కనే వున్న పన్నీరు బుడ్డి తీసుకుని, నెత్తిమీద జల్లుతూ" కన్నీరు-పన్నీరు రెండూ ఒకటే. రెండూ నీళ్ళే. నీ అమ్మనూ నేనే, నీ అమ్మమ్మనూ నేనే" అంటూ చక్కెరకేళీ ఒలుస్తూ "పైన కనిపించేది తీస్తే తప్ప, లోపలున్నది కనిపించదు. ఆ కనిపించింది తింటే తప్ప ఆకలి తీరదు. ఆకలి తీరితేగాని ఆత్మారాముడికి శాంతిలేదు" అంటూ పండు తినిపించటం మొదలు పెట్టింది. పండుకోసం చేయి చాపుతుంటే "నోట్లో పెట్టడమే అమ్మకు ఇష్టం. నోరు తెరు" అన్నది.

"అవును ! ఎన్నిసార్లు చదువుతావురా ! హనుమాన్ చాలీసా నువ్వు!" అంటూ "రఘువరదాసు దయ అంతా నీమీద" అన్నది.

పండు తినిపిస్తున్నపుడు మళ్ళీ మా అమ్మమ్మ గుర్తుకు వచ్చింది. అంటే ఆమె బ్రతికే వుంది. కానీ దూరంగా వుంది. అందుకు ఆమె గుర్తొచ్చింది.

"ఎక్కడికీ వెళ్ళకు. వచ్చింది నా కోసం. ఒక్కడివే వచ్చావు. భయంలేదా? మధ్యాహ్నం అన్నం తిని వెళ్ళు" అన్నది మధ్యాహ్నం అయ్యేదాకా ఆమె దగ్గరే వున్నాను. ఆమె కాసేపు మాట్లాడటం, మరికొంతసేపు మౌనం. ఆమె మాట్లాడుతున్నంత సేపూ నిశ్శబ్దం. ఆమె మౌనంగా వున్నంత సేపూ ఎన్నో మాటలు.

ఇంతలో ఆకలివేళ ఆమె ముద్దలు కలిపి నోట్లో పెడుతున్నది. మళ్ళీ అచ్చం మా అమ్మమ్మలాగే! ఆమె వేళ్ళు, నా నోట్లో ఎంగిలవుతున్నయ్యనుకున్నాను. పైకి అనలేదు. "బ్రహ్మముట్టనిదేమన్నా వుందా! ఎంగిలి కాని దేమున్నది, అయిందేమున్నది, తల్లికి కావలసింది, 'గిలి'. ఆ గిలి కోసమే యిదంతా", అమ్మ ఆగి, "సాయంత్రం కల్లా బయలుదేరు" అన్నది.



గుర్తించే గుర్తు లేక దీపమున్నా గుర్తించలేరు. - అమ్మ

ఆమెను చూచిన తొలివేళ అది. బయలుదేరబోయే ముందు మళ్ళీ ఆమె గదిలోకి వెళ్ళాను. ఆమె కూర్చున్న మంచం, విశ్వసింహాసనం లాగా వుంది. బాసిం పెట్టుకుని కూర్చున్న తీరు "సింహాసనేశ్వరి" యైన త్రిపురసుందరిలాగా ఉంది.

అరుణారుణంగా తీర్చిన నుదిటి కుంకుమ, ఉదయాద్రిని మెలిచిన భానుబింబంలాగా వుంది. రెండు చేతులూ దరించిన నిండుగాజులు, శబ్దం బ్రహ్మలై ఆమెను ఆశ్రయించినట్లున్నాయి. ఆమె కట్టిన పట్టుచీర, అష్టదిక్కులు ఆమెను చుట్టుకున్నట్లుంది.

"నువ్వు నాకోసం, నేను నీ కోసం" అంటూ ఆమె ద్రాక్షపళ్ళు గుత్తిని చేతిలో పెట్టింది. పది రూపాయల నోటు ఇచ్చింది. మంచం దిగింది. బయటకు వచ్చింది, సాగనంపింది.

ఇంతకీ, బయట వున్న నన్ను చూడకుండానే నన్ను లోపలికి రమ్మన్నదే! అమ్మ, అమ్మమ్మ నేనే నంటూ పెరిగింది అమ్మమ్మ దగ్గర అన్నదే? అమ్మలగన్న అమ్మ అమ్మమ్మేకదా!

హనుమాన్‌చాలీసా ఎన్నోసార్లు చదువుతానని ఆమెకు ఎవరు చెప్పారు? రఘువరదాసుగారు అనబడే అవధూతేంద్ర సరస్వతీ స్వామి దయవల్ల నాకు చాలీసా వచ్చిందని ఆమెకెలా తెలుసు? నేను ఒంటరిగా వచ్చినట్లు ఆమెకు ఎలా తెలుసు? ఆమెకు అన్నీ తెలుసునని తర్వాత తెలిసింది. ఎన్నో అనుభవాలు. అవన్నీ తరువాత! ఆమెను 'చూడాలని' వెళ్ళి... దర్శించాను. చూడటం వేరు, దర్శించటం వేరు కదా!

ఆమె, ఆమె అన్న మనస్సు మరెన్నడూ 'ఆమె' అనలేదు. 'అమ్మ' అనటం మానలేదు. సర్వాలంకార భూషితమై, త్రిశూలధారిణిగా తరువాత కాలంలో దర్శనమిచ్చిన 'దేవీ' రూపం కంటే, ఒడిలో పడుకోబెట్టుకుని, ముద్దలు తినిపించిన అమ్మే. నా గుండెలో నిలిచిన యిష్టమయిన, అందమైన బంగారు బొమ్మ!

'అమ్మ' అనే బంధం కంటే, ఆమెను దేవతను చేసి, వేరుగా చూసే సంబంధం ఎంత చిన్నది! ఇంత జరిగినా 'అమ్మ' కాళ్ళకు అందరిలాగా దణ్ణం పెట్టలేదు. అమ్మ ఒడిలో పడుకున్న నాకు, అమ్మను నాకంటే వేరుగా చూడటం ఇష్టం లేదు.



తన్ను తాను గుర్తించిన వాడు సర్వాన్ని గుర్తిస్తాడు. - అమ్మ

అమ్మ పుట్టతేనె! అమ్మ ఆనంద సౌందర్యం! అమ్మ పూర్ణాద్వైతం! అమ్మ అంటే నేను! 'నేనంటే' అమ్మ! పరిమితరూపమూ, అనంతశక్తి, పూర్ణమాతృత్వం కలబోసుకున్న అవ్యాజకారుణ్య త్రివేణీ సంగమం అమ్మ. అమ్మ ఉపాసనామార్గంలో ఉన్నదంతా పూర్ణాద్వైతమే. శంకరులు, భగవాన్ రమణులు ప్రతిపాదించిన పూర్ణాద్వైత సాధనకు అమ్మజీవితం ఒక దివ్య ఉదాహరణ.

కర్మాద్వైతం, ఉపాసనాద్వైతం, జ్ఞానాద్వైతం, వైరాగ్యాద్వైతం, మోక్షం నిండుగా పరచుకున్న శతపత్ర జీవితం అమ్మది.

సంసారం ఉన్నది గనుక అది కర్మాద్వైతం. సర్వదైవోపాసన ఉన్నది గనుక ఇది ఉపాసనాద్వైతం. సత్యం, జ్ఞానం అనంతం బ్రహ్మ. ఇదంతా నివృత్తి మార్గం. అదీ ఉన్నది గనుక అది జ్ఞానాద్వైతం. ఏదీ శాశ్వతం కాదని ఒక్క భగవద్భావనే శాశ్వతమని బోధించినందున అమ్మది వైరాగ్యాద్వైతం.

'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః
సన్యాస యోగాత్ యతయః శుద్ధసత్వాః
తే బ్రహ్మలోకే తు పరాంతకాలే
పరామృతాత్ పరిముచ్యంతి సర్వే.'







అన్ని రూపాలూ ఒకటే నన్న స్థాయి రావటమే దైవత్వం. - అమ్మ

# అమ్మ మాటలలోని ప్రత్యేకత

-డాక్టర్ పన్నాల రాధాకృష్ణశర్మ

అమ్మ అనేక సందర్భాలలో ఆధ్యాత్మిక సత్యాలను అలవోకగా, తేట తెలుగు మాటలలోను, నాతి కఠినమైన సంస్కృత పదాలలోను వివరిస్తుంటుంది. అమ్మచేసే యీ ఆధ్యాత్మిక ప్రవచనం సనాతన సంప్రదాయ సంబద్ధమని కొందరూ, కేవలం వినూతనమైనదనీ విప్లవాత్మకమైనదనీ కొందరూ చెబుతుంటారు. నిజానికి అమ్మ చెప్పే మాటలు ఒక మతానికిగాని, ఒకజాతికిగాని, ఒకదేశానికి గాని పరిమితమైనవి కావు. అవి విశ్వజనీనమైన శాశ్వత సత్యాలు. నా బుద్ధికి అందినంత మేరకు అమ్మ మాటలలోని విలక్షణతను వివరించటానికి ప్రయత్నిస్తాను.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" - అన్నది వైదికవాణి. ఇదంతా - అంటే దృశ్యమానమైన విశ్వమంతా - బ్రహ్మ స్వరూపమే. ఈ భావమే సకలోపనిషత్సారభూతమైనది భగవద్గీత యందలి దశమాధ్యాయంలోని

"అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే"

(నేను సర్వానికి కారణము, సర్వమూ నా నుండే ప్రవర్తిల్లుతున్నది)

"న తదస్తి వినా యత్ స్యాత్ మయాభూతం చరాచరమ్"

(నేను లేని చరాచర భూత ప్రపంచం లేదు).,

అన్న వాక్యాలలో గోచరిస్తుంది. "ప్రపంచమంతా బ్రహ్మ స్వరూపమే" అని అమ్మగూడ అన్నది. దాన్నే మరికొంచెం వివరిస్తూ "చీమలోను, దోమలోను భగవంతుని చూడటం గాదు, చీమగాను, దోమగాను భగవంతుడున్నాడు" అనగా "సర్వేశ్వరుడు సర్వాంతర్యామియే గాడు, సర్వమూ తానయైన వాడు" అని బోధ పడుతుంది. అయితే పై వేదిక వాణికీ, తత్సారభూతమైన గీతా వచనానికి తేడా లేక పోవడంలో విశేషం లేకపోయినా ఆ రెంటికీ అమ్మ మాటలకూ గూడా తేడా లేదే? అన్న సందేహం కలగవచ్చు. కానీ అమ్మ మాటలలో నిస్సందేహంగా వైలక్షణ్యమున్నది.

ఎలాగంటే - "అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం......." "న తదస్తి వినా యత్....' అన్న భగవంతుడే



అన్ని రూపాలూ ఆయనవే కనక రూప రహితుడు. - అమ్మ

"హంత! కథ యిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః!

ప్రాధాన్యతః కురుశ్రేష్ఠః నాస్త్యంతో విస్తరస్య మే "

(అహో! కురుశ్రేష్ఠా! నా ద్వియ విభూతులకు అవధి లేదు. కావున ప్రధానము లైన వానిని చెప్పుచున్నాము).

"ఆదిత్యానా మహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్"

(నేను ఆదిత్యులలో విష్ణుడను, జోతిస్సులలో సూర్యుడను)

"..........జ్ఞానం జ్ఞానవతామహమ్"

(జ్ఞానవంతులలో జ్ఞానమును)

అన్న శ్లోకం వరకూ తన విభూతులను వివరించి

"యద్య ద్విభూతిమత్సత్త్వం శ్రీ మదూర్జిత మేవ వా!

త త్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్"

(ఏది లోకములో విభూతిమంతము, శ్రీమంతమూ, సాహసవంతమూ అయివుంటుందో అదంతా నా తేజోంశము వలన పుట్టినదని తెలిసికొనుము)

అని విభూతి విజ్ఞానాన్ని వివరిస్తాడు. ఇక్కడ "అహం సర్వస్వ ప్రభవః.....", "నతదస్తి వినాయత్...." ఇత్యాది వాక్యార్థానికి, "యద్యద్విభూతిమత్...." ఇత్యాది వాక్యార్థానికి హస్తిమశకాంతర మంత వ్యత్యాసం చూడగానే గోచరిస్తుంది. గీతాచార్యులకు గూడ పాక్షిక సత్యసందర్శనమే అయిందా? అని అనుమానం గూడా కలుగుతుంది. వెంటనే "ప్రజ్ఞానం బ్రహ్మ అయితే అజ్ఞానం ఎందుకు కాదు?" "అన్నం బ్రహ్మ అయితే అశుద్ధమో" ఇత్యాదులైన అమ్మ వాక్యాలు హృదయానికి సూటిగా తాకి పై అనుమానం బలపడుతుంది. అమ్మ మాటలలోని అసందిగ్ధమైన, నిస్తులమైన అద్వైత సిద్ధికి అంతరంగాలలోనే జోహారు లర్పించుకుంటాము.

అంతటిలో సనాతన సత్యాన్ని ప్రవచించిన ఉపనిషద్వాణికి, సనాతనిగా, సర్వేశ్వరిగా, మనచే భావించబడుతున్న అమ్మ చెప్పిన మాటలకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడుతుంది. కానీ యిటువంటి నిర్ణయం హేతుబద్ధం కాదేమో అనిపిస్తుంది.



అన్ని నామాలు ఆయనవే కనక నామ రహితుడు. – అమ్మ

మరి భూమ్యాకాశాల కున్నంత వ్యత్యాసం గల యీ ద్వివిధ భావనలకు సమన్వయం ఎలా కుదురుతుంది? చాలా చిక్కైన ప్రశ్న! అయినా అమ్మ స్ఫురింపచేస్తున్న ఆలోచనా మార్గాన పయినిస్తే సమన్వయం దుష్కరంకాదనిపిస్తున్నది కాబట్టి మనవి చేస్తాను.

అర్జునుడు "కథం విద్యా మహం యోగిన్! త్వాం సదా పరిచింతయన్! కేషు కేషుచ భావేషు చింత్యోసి భగవన్! మయా॥" (యోగీ! ఎల్లపుడు ఎట్లు ఎట్లు చింతించుచు నిన్ను తెలుసుకోగలను? భగవానుడా! నీవు నాచే యే యే భావము (వస్తువు) లందు ధ్యానింప దగిన వాడవు?) అని ప్రశ్నింపగా, భగవంతుడు "హంత! తే కథ యిష్యామి...." అన్న శ్లోకంతో విభూతి వివరణాన్ని ప్రారంభిస్తాడు. ఇక్కడ అర్జున వాక్యంలోని "చింత్యః" అన్న పదమూ, భగవద్వాక్యంలోని "విభూతయః" అన్న పదమూ నిశితంగా పర్యాలోచింప దగినవి. భగవంతుడు చరాచర ప్రపంచ హేతువనీ, అతడు లేనిదేదీ లేదని అర్జునున కప్పటికి బాగా తెలిసినది. కాని సర్వత్ర సర్వస్వరూపుడై భాసించే ఆ విశ్వరూపుని గుర్తించటమెలాగో అతనికి బోధపడలేదు. ఆ గుర్తింపు లేనిదే ఆ భగవంతుని ధ్యానించడం సాధ్యపడదు. మరి ఆ గుర్తింపు ఇవ్వవలసిన వాడు గూడ అతడే కాబట్టి " కథం విద్యామహం...." ఇత్యాది శ్లోకంలో అర్జునుడు తనకు ధ్యానం నిలిచే మార్గాన్ని ఉపదేశించ వలసినదిగా భగవంతుని ప్రార్థించాడు. "చింత్యః" - అంటే ధ్యానింపదగిన వాడు అని అర్ధము. సాధకునకు సంకేతమైన అర్జునుని యీ సంశయాన్ని నివారించటానికి భగవంతుడు "హంత! తే కథ యిష్యామి...." ఇత్యాది శ్లోకాలలో ధ్యేయ స్వరూపాన్ని ప్రవచించి ధ్యాన మార్గాన్ని సుగమం చేశాడు. ఈ శ్లోకంలోని "విభూతి" శబ్దాన్ని అపరశంకరులనదగు శ్రీ బెల్లంకొండ రామరాయ విద్వద్వర్యులు తమ భాష్యార్క ప్రకాశంలో ఇలా వివరించారు.

"భగవత్యాత్మని బ్రహ్మణి కల్పితాః మాయయా చరాచరాత్మకా స్సర్వే పదార్థాః విభూతి శబ్దేనోచ్యన్తే! విశేషేణ భూతిర్భవనం విభూతిరీతి వ్యుత్పత్తేః! ఏక రూపేణ స్థితోహ్యాత్మా మాయయా బహురూపో భవతి" - భగవంతుడగు పరమాత్మ యందు మాయచే కల్పించబడిన చరాచరాత్మక పదార్థములన్నియు విభూతులని చెప్పబడును! ఒక్క రూపమున ఉన్న ఆత్మయే మాయచే బహురూపమగుచున్నదని పై వివరణ



స్థితులు పొందటం కాదు ఏర్పడి వుంటాయ్. మానవులకే కాదు జీవ జంతువులన్నిటికి. - అమ్మ

సారాంశము. అనగా స్థావర జంగమాత్మకమైన విశ్వమంతయే భగవత్స్వరూపమే అన్నమాట ! అయినచో భగవంతుని విశ్వరూపునిగానే అర్జునుడు ఆరాధించవచ్చునే? సర్వమూ భగవన్మయమే అయినపుడు "కథం విద్యామహం ...." అనీ, సర్వ వస్తువులూ తద్రూపములే అయినపుడు "కేషు కేషు చ భావేషు...." అనీ, అర్జునుడు అనటం దేనికి? అను ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. కానీ అర్జునుడిక్కడ సాధకునికి ప్రతీక అన్నసంగతి మరువరాదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" అన్న వాక్యార్థములు తానే ఐ సాధ్య సాధనాలు రెండూ తానే ఐన వానికి ఈ ప్రశ్నలు ఉదయించవు. కానీ తనకంటే భిన్నమైన దైవమున్నదనే స్ఫురణ కలిగిన సాధకునకు పై ప్రశ్నలు తప్పవు. అందువల్ల భగవానుడు "ఆదిత్యానామహం విష్ణుః" ఇత్యాదిగా తన విభూతులను వివరించవలసి వచ్చింది. తన చుట్టూ వుండే వస్తువుల నన్నిటినీ భగవన్మయంగా చూడటం సాధకునకు సాధ్యపడని దశలో అలా వివరించ వలసిన ఆవశ్యకత కలిగింది. "వైభవోపేతమైన శ్రీమంతమై, తేజోవంతమైన పదార్థము" వైపు మానవ దృష్టి ఆకర్షింపబడుతుంది. 'దేనిమీద దృష్టి నిలుస్తుందో దాని మీద మనస్సు లగ్నమవుతుంది'. అదే 'ధ్యాస లేక ధ్యానం'. "ధ్యాసే - ధ్యానము" అని అమ్మగూడ అంటున్నది. ఈ పరమ సత్యం నిత్య జీవితంలో మనకు ప్రత్యక్షమవుతూనే వుంది. అన్ని గృహాలూ దేవాలయాలే అయినా, దేవాలయాలని చెప్పబడే కొన్ని స్థలాలకే వెళ్ళుతున్నాము. అన్ని శిలలూ పరమేశ్వరాకృతులే అయినా పాకీదొడ్డిలోని పాషాణాన్ని పూజించటం లేదు. అన్ని రూపాలూ భగవంతునివే అయినా ఒక్కొక్కరికీ ఒక్కొక్క రూపం మీదనే ఎక్కువ మక్కువ. అన్ని నామాలు దేవునివే అయినా ఒక్కొక్కరికి ఒక్కో నామం మీదనే మమత. ఆ విధంగా ఆయా వ్యక్తులు గమ్యం చేరుకుంటారు - లేక గమ్యమే తామైపోతారు. ఒక్క రూపంలో దైవాన్ని చూడగలిగిన సాధకుడు క్రమంగా సర్వత్రా దైవాన్ని చూడగలుగుతాడు. ఇంతెందుకు? అమ్మ అంతటా వ్యాపించి ఉన్నదని మనం అంటున్నాము. ఆమెకు తెలియనిదేమీ లేదని చెబుతున్నాము. కానీ జిల్లెళ్ళమూడికి వస్తూనే వున్నాము. మన బాధలూ, గాథలూ ఏదో విధంగా అమ్మకు చెప్పుకుంటూనే వున్నాము. నిజానికి విశ్వమయుడైన భగవంతుని ధ్యానించటానికి విగ్రహంతో పనిలేదు. కానీ "నిగ్రహం కోసం విగ్రహం కావాలి" అన్నది అమ్మ.

అందువల్ల భగవంతుడు విశ్వమయుడని క్రమంగా గుర్తించడానికి ఒకమార్గంగా గీతాచార్యుడు విభూతి యోగాన్ని ఉపదేశించాడనిపిస్తుంది. అందులో కనుపించే పూర్వాపర ప్రసంగ వైరుధ్యం ప్రాతిభాసికం మాత్రమే అనిపిస్తుంది. అందుకే చిట్టచివర "అథవా బహునైతేన కిం జ్ఞానేన తవార్జున!

విష్టభ్యాహమిదం కృత్స్న మేకాం శేన స్థితోజగత్"

(అర్జునా! విస్తృతమైన యీ జ్ఞానముతో నీకు పని యేమి. ఈ సర్వ జగత్తునూ ఏకాంశమున వ్యాపించి ఉన్నాను) అని భగవానుడంటాడు. ఇక్కడ 'ఏకాంశేన' అన్న పదానికి 'ఏకావయవేన, ఏకపాదే – సర్వభూతస్వరూపేణ' – అని శంకర భగవత్పాదులు తమ భాష్యంలో వివరించారు.

"విభూతి మంతములు, శ్రీమంతములు, ఊర్జితములూ ఐన పదార్థములే భగవదంశ సంభవములా? అనీశ్వర దరిద్రాదులు కారా? అన్న ప్రశ్నకు పై శ్లోకము సమాధానమని చెబుతూ శ్రీ రామరాయ కవీంద్రులు తమ భాష్యార్క ప్రకాశంలో ఇలా వివరించారు. "నను న తదస్తి వినేత్య నేన సర్వస్య జగతః, ఈశ్వర విభూతిత్వస్య ఉక్తత్వాత్ విభూతిమంతః శ్రీమంతః ఊర్జితా ఏవ మత్తేజోంశ సంభవత్వాన్మద్విభూతయః అనీశ్వరాః దరిద్రాః నిరుత్సాహాస్తు మత్తేజోంశా సంభవత్వాత్ న మద్విభూతయ ఇతివచనం విరుద్ధమ్" – ఇతి శఙ్కాయాం మత్తేజోంశ సంభవం విభూత్యాది గుణయుక్తం భూతం మద్విభూతిరితి ప్రాధాన్యేనోక్తం ధ్యేయత్వార్థమ్! వస్తుతస్తు సర్వం జగత్ మద్విభూతిరేవ మత్తో జాతత్వాత్ మయ్యేక కల్పితత్వాత్ సర్వస్య మదాత్మ కత్వాత్" – విభూతిమత్, శ్రీమదాదులు భగవదంశ సంభవములైనట్లే అనీశ్వర, దరిద్రాదులు గూడ తదంశ సంభూతులే యనీ, విభూత్యాది గుణయుక్తమే మత్తేజోంశమనుట ధ్యేయతా దృష్టిటో గావింపబడిన ప్రాధాన్యవ్యపదేశమనీ, నిజానికి సర్వజగత్తూ భగవద్విభూతియే యనీ పయి వ్యాఖ్యానంలోని సారాంశము.

పయి పరిశీలన వలన తేలినదేమంటే ఉపనిషద్వాణికీ, అమ్మ మాటలకూ ఏ మాత్రమే బేధం లేదనియే. రెండిటి తాత్పర్యమూ ఒక్కటే. అయితే అమ్మ మాటలలోని వైలక్షణ్యమేమిటి? దీనిని వివరించటానికి ముందు మాతృత్వమంటే యేమిటో,

తత్ప్రయోజనమేమిటో తెలుసుకుంటే మాతృరూపంలో మసలుతున్న భగవంతుని ప్రవచనంలోని ప్రత్యేకత అర్థమవుతుంది.

మాత రక్షిస్తుంది, పిత శాసిస్తాడు. పితృప్రబోధం శాసనరూపంలో ఉంటే మాతృ ప్రబోధం రక్షణ రూపంలో వుంటుంది. విద్య తల్లి వంటిది, తండ్రి వంటిదీ అని చెబుతూ ఒక మహాకవి "మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే" అని మాతా పితరుల విధులను పరోక్షంగా వివరించాడు. అమ్మ మాతృత్వ వివరణను చేస్తూ ఒక సందర్భంలో "తల్లికి తప్పుదు - గాదు, తల్లికి తప్పే కనుపించదు" అని చెప్పింది. మరొక సందర్భంలో "శుచిగా ఉన్నట్లు కనబడే వారిని దగ్గరకు తీసుకోవటమే పీఠాధిపతుల యొక్క ధర్మం, బురద పూసుకున్న బిడ్డను ఎత్తుకొని లాలించి బురదను కడిగివేయడం తల్లి ధర్మం" అని గూడా చెప్పింది. ఇదే మాతృత్వమంటే. ఇందులోనే దాని ప్రయోజనం కూడా ప్రపంచితమై ఉంది.

విధి నిషేధాలతో గూడిన శాసన ప్రధానమైన పితృ ప్రబోధంలో సత్యము యొక్క సమగ్ర రూపం చక్కగా గోచరించే అవకాశాలు తక్కువ. విధి నిషేధాలను త్రోసి రాజని బిడ్డ కోసమై తపించే తల్లి యొక్క లాలనా ప్రధానమైన మధుర మంజుల సల్లాపంలో సత్య సాక్షాత్కారం సమగ్రంగా కలుగుతుంది. ఇంతవరకు పురుష రూపంలో అవతరించిన భగవంతుడు, సర్వులనూ లాలించి మురిసిపోతూ, విధి నిషేధాలను అధిగమించిన అనిర్వచనీయ ప్రేమ వాహినిలో తరింపచేయటానికిలా అవని మీద అమ్మలా అవతరించాడేమో అనిపిస్తుంది.

ఇక అమ్మ మాటలలో గోచరించే విలక్షణత ఏమిటో పరిశీలిద్దాం! భగవంతుడు సర్వభూత స్వరూపుడని చెబుతున్నా తేజస్సు, బలము, సంపద వంటి వాని వివరణంలోనే ఉపనిషద్వాని ఉల్లాసం చూపింది. "తమసో మా జ్యోతిర్గమయ" "అసతో మా సద్గమయ" అన్నది ప్రపంచం యొక్క రెండవ పార్శ్వాన్ని బాగా పరామర్శించలేదు. వెలుగులోనే జీవిస్తున్న వ్యక్తికి చీకటి దుర్భరమనిపిస్తుంది. ధైర్యమే ఆలంబనమనుకున్న వ్యక్తికి అధైర్యము అసహ్యమనిపిస్తుంది. మంచినే మననం చేస్తున్న వ్యక్తికి చెడు దుస్సహంగా అగుపిస్తుంది. ప్రపంచం యొక్క యీ ఉభయ పార్శ్వాలనూ



పొరపాట్లతో కూడినదే మానవత్వం. - అమ్మ

మృదువుగా, నిసర్గ సుందరంగా అమ్మ బోధిస్తుంది. "చీకటే వెలుతురు కాధారము", "అధైర్యమే ధైర్యాని కాధారము", "ఒక బాధ తగ్గవలెనంటే మరొక బాధ కావాలి", "ద్వంద్వా లున్నపుడే ఆనందం వున్నది" ఇలా వుంటాయి అమ్మ సూక్తులు. వెలుగు నీడలూ, మంచి చెడ్డలూ, సుఖదుఃఖాలూ మొదలైనవి ఒక నాణెమునకు ఇరువైపుల వంటివనీ, రెండూ లేనిదే జీవితం సమగ్రం కాజాలదనీ అవి అవిభాజ్యములనీ చీకటిలో గూడ వెలుగు కనబడుతుందనీ చెడ్డలో నుండి మంచి ఆవిర్భవిస్తుందనీ, దుఃఖంలో గూడ సుఖం వున్నదనీ అవ్యవస్థలో నుండి సువ్యవస్థ ఆవిర్భవిస్తుందనీ, అమ్మ సోపపత్తికంగా నిరూపిస్తుంది. అయితే "దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహ" వంటివాక్యాలలో భగవద్గీత కూడా ఈ మహాసత్యాన్నే చాటుతున్నది. కానీ ఆ ఉపదేశం సామాన్యాకారంలో వుండి సాధారణంగా సద్యోవేద్యం కాకపోతున్నది. మరి అమ్మ సూక్తులు అలా కాక నిత్యము జీవితములో మనం అనుభవించే సంఘటన లాధారంగా చెప్పబడినవి గాబట్టి విశేషాకారంలో విలసిల్లుతూ సూటిగా మన మనస్సుకు తాకుతాయి. మనకెంతో ఉపశమనం కలుగుతుంది. ఇదే అమ్మ మాటలలోని ప్రత్యేకత.





# విశ్వమానవాలయం

- శ్రీ చంద్రమౌళి వెంకటకృష్ణ
హైకోర్టు అడ్వకేట్

ఇది దేవాలయం కాదు ఇది విశ్వమానవాలయం

మాట్లాడని దేవుళ్ళు చీదరించుకునే పూజార్లు

దాక్షిణ్యంలేని ధర్మకర్తలు ఇక్కడలేరు

దర్శనానికి రూపాయి అభిషేకానికి నూటపదహార్ల కక్కుర్తిలేదు

మొక్కులకు తలనీలాలివ్వనవసరం లేదు

ఉన్నదంటే ఉంది 'అమ్మ' - లేదంటే ఉండేది 'కొమ్మ'

మనిషిలో లేని దైవత్వం రాళ్ళలోలేదు రప్పలో లేని మానవత్వం మనిషిలో ఉంది.

అమ్మలో ఉంది దైవత్వం ప్లస్ మానవత్వం

దైవం కోసమే మానవుడు - మానవుడికోసం దైవంకాదు

మానవుడు లేనిదే దైవంలేదు - మానవుడికి దేవుడికి ప్రతిరూపం 'అమ్మ'

ఇది నిజం, ఇది నిజం, ఇది ముమ్మాటికీ నిజం

పాతనమ్మకాలకు బూజు పట్టింది. రోతచెందిన శాసనాలు శిధిలమైనై.

ముందున్న మహాయుగానికి నాందీ ప్రస్తావన జరుగుతోంది.

మతమన్న అడ్డుగోడలు కూలిపోతున్నై - కులమన్న కుళ్ళు క్షాళనమౌతున్నది

విశ్వమానవుడు వైతాళికుడై విశ్వమతాన్ని ప్రబోధిస్తున్నాడు

ఇది దేవాలయం కాదు ఇది విశ్వమానవాలయం.

సంపంగి తోటలో సర్పాలుంటాయి. ఆలయం ఆవల రాబందులున్నాయి.

అభాండాలు అపవాదులు దుష్ప్రచాలు చేసే అన్నయ్యలున్నారు



కొంత తనదీ చాలామట్టుకు దేవుడిదీ అనుకోవటం మానవత్వం. - అమ్మ

కీలు బొమ్మవై కైవల్యానికి దూరంకాబోకు

నీ మనసు నీకు సాక్ష్యం–నీ అనుభవం–నీ నిదర్శనం నీ హృదయం నీ ప్రమాణం

ఇది దేవాలయంకాదు ఇది విశ్వమానవాలయం.

గారడీ గల్లంతులు – కనుకట్టు విద్యలు – మంత్రకుతంత్రాలు ఇక్కడలేవు.

ఐశ్వర్యం ఇచ్చే మహర్షి కరుణ చూపలేదు.

బిడ్డలను ప్రసాదించే మాతంగి అయువుపోడిగించలేదు.

అందరూ కోరి ఎవ్వరూ ఇవ్వని కరుణామృతాన్ని పంచుతోంది 'అమ్మ'.

ఇది దేవాలయం కాదు ఇది విశ్వమానవాలయం.

బంధువుగా చేరి – బంగారు సంకెళ్ళు తగిలించుకోకు – పండితుడివై పాండిత్య ప్రకర్ష ప్రదర్శించకు

విజ్ఞాననిధినని దుందుభీ మ్రోగించకు – పరీక్ష చేయబోయి పరాజయం పొందకు

తపస్వివై అహర్నిశలూ తపించు – పూజారివై నిరంతరం ఆరాధించు.

విశ్వమానవుడివై తోటి మానవుణ్ణి ప్రేమించు

ఇది దేవాలయం కాదు ఇది విశ్వమానవాలయం.

వేదాంతిలో పామరుడిలో నాస్తికుడిలో అశాంతిలో ఆకలిలో ఆనందంలో

పేదవాడి చిరునవ్వులో – అభాగ్యురాలి నిట్టూర్పులో – అంగవిహీనుడి హృదయంలో

జ్యోతిర్మయి ఐ వెలుగుతోంది – అణువణువు బంధించి అమ్మగా నిలచింది

ఇది దేవాలయం కాదు ఇది విశ్వమానవాలయం.

అమ్మ వాక్కు సత్యం – రూపం శివం – చేష్టలు సుందరం

కరుణ జలపాతం – హృదయం విశ్వాంతరం – ఉనికి కలకాలం

ఇది దేవాలయం కాదు ఇది విశ్వమానవాలయం.



# ఏది వచ్చినా - నేను ఏది ఇచ్చినా స్వీకరించి అనుభవించే స్థితే ఆనందం

-ప్రొఫెసర్ **యం. శివరామకృష్ణ**

ఏ సందర్భంలో చెప్పిందో తెలియదు. ఒకసారి అమ్మ అన్నది "బాబూ! నీవు కావాలని అనుకున్నవి, వద్దని అనుకున్నవి, అన్ని నీ పాత్రలో వేస్తున్నా. అవన్నీ నువ్వు స్వీకరించాల్సిందే. సంతోషం కలిగించినా, దుఃఖం కలిగించినా ఆ అనుభవాలన్నీ నా వరాలని ఆనందంతో అనుభవించు గెలిచినా, ఓడినా, పొంగవద్దు, క్రుంగవద్దు. ఎందుకంటే నేనే ఆ అనుభవాలన్నీ ఇచ్చా".

అమ్మ చెప్పినవి, చేయమన్నవి సునాయాసంగా అర్థమవుతాయి. అర్థం అనాయాసంగా తెలుస్తుంది. కాని ఆచరణలో పెట్టటం కష్టం. ఎందుకు ఆచరించటం కష్టం? అది కష్టమని అనుకున్న వాళ్ళని (వీళ్ళలో నాదే మొదటి పేరు!) ఉద్దేశించి కొన్ని ఆలోచనల పర్యవసానం ఈ నాలుగు మాటలు.

మొదట : "నేనే" అన్ని అనుభవాలని ఇచ్చాను అని అమ్మ ఏ సందిగ్ధం లేకుండా చెప్పింది. తానే ఇచ్చానని ధృవీకరించినపుడు అమ్మ ఇచ్చినవి అన్నీ అంగీకరించాలి కదా! ఇంగ్లీషులో "you have to take them all" అని ఉంది. "have to" అంటే కేవలం అంగీకరించాలి అనటం కన్నా, "అంగీకరించాల్సిందే" అని నొక్కి చెప్పే అర్థం గ్రహించాలి. అనిపిస్తుంది. అమ్మే ప్రసాదిస్తే కాదని అనగలమా? లేక అనగలిగే అవకాశం కాని, ధైర్యం కాని ఉన్నదంటే ఏమనుకోవాలి?

మరొక సూక్ష్మం : "have to" తోపాటు "take them all" అంటుంది అమ్మ. ఏది ఇచ్చినా, అది అంగీకరించాలి. ఇంగ్లీషులో Mother of all అని అన్నపుడు విశ్వజనని, అందరి అమ్మ అన్న అర్థంతోపాటు giver of all అన్నీ అమ్మ అనికూడా అనుకోవటం అవసరం. ఆమె సంకల్పంలో ఆమె దృష్టిలో "అనుకున్నవన్నీ" ఇదీ ఒక అర్థమే. All అన్నీ వుంటే అన్ని అనుభవాలు, విభజనకి తావిచ్చి మన "బుద్ధి" ప్రకారం వాటిలో ఎంచుకునే అవకాశం లేనివి, అవకాశం లేదనే స్పష్టంగా అమ్మ

చెపుతోంది. అమ్మ ప్రసాదించిన వాటిని మన స్పందనలతో ముడిపెట్టకుండా యధాతథంగా అంగీకరించాలి.

మనకి కావాలని మనం అనుకున్నవి, మనకి అవసరమని అమ్మ అనుకున్నవి. రెండూ ఒకటైతే మంచిదే. కాకపోతేనే దిగులు, చికాకు. ఇవి కూడా చికాకు పెట్టినాఆ దిగులులోంచే, ఆ చికాకు నుంచే అంగీకరించే శక్తి ఆవిర్భవించేటట్లు చేయగలిగే శక్తి, సహనం కూడా ఆ శక్తిపీఠం నుంచి రావల్సిందే! గొంగళిపురుగు నుంచి సీతాకోకచిలుక వచ్చినట్లు స్థూలంగా కనిపించే నిరుత్సాహం, దిగులు నుంచే ఆచరించే శక్తి వస్తుంది. ఆమె అది కూడా ప్రసాదించే మూలవిరాట్.

మరి కొన్ని అనంగీకారంగా తోచటం ప్రకృతి సహజధర్మమే. మామిడి పిందె వగరుగా ఉంటుంది, మామిడికాయ పుల్లగానూ, మామిడిపండు తియ్యగానూ ఉంటాయి. దేని ఉపయోగం దానిదే. దేని పాత్ర దానిదే. పండు ఊరగాయకి పనికిరాదు. కాయ తినటానికి కాక సంవత్సరం పొడుగునా పనికివచ్చే ఊరగాయకి అవసరం. బహుశః అనంగీకారంగా కనిపించే అమ్మ చేష్టలు మరింత విలువైనవి. జీవితం పొడుగునా "పనికి" వచ్చేవి ఇవ్వే అనుకొనటం మరింత వివేకంతో కూడినది అనిపిస్తుంది.

ఆనందంతో అమ్మని తలుచుకున్నా, "నువ్వు చెప్పినవి ఆచరించలేకపోతున్నా" అన్న బెంగతో భావించినా అమ్మ మన భావనా స్రవంతిలో ఉన్నట్లే కదా! ఒకటి ప్రకృతి, మరొకటి వికృతి అనుకుంటేనే సమస్య. ఆ విధంగానే ఆలోచిస్తాం అంటే అదీ అంగీకారమే. "ఏదీ మన చేతిలో లేదు" అని అనుకొని, జీవించటం కష్టమని మనకి అనిపించినా, మన శక్తిని మించిన దాన్ని మోయమని ఏ తల్లి అనదు. అమ్మకి ఆ ఆలోచనే ఉండదు. (అని అనుకుంటున్నా).

అమ్మ ఒక సందర్భంలో మరో సూక్ష్మం చెప్పింది. "It is I who myst give you every thing at all times" "I" ని "నేను" అని చెప్పకుండా "నేనే" అని చెప్పుకోవాలి. "నేను మాత్రమే" అని చెప్పటం మరింత అర్ధవంతం. "I alone" అనచ్చు. మరి "everything" అంటే? "ప్రతీదీ" అని చెప్పొచ్చా. అపుడు మనం



సుఖానికి మార్గం ఒక్కటే. ఏది చేసినా దైవం చేశాడనుకోవటమే. - అమ్మ

కాంక్షించే (ఒక్కొక్కసారి "కామించే" ప్రతీది అని అనటానికి లేదు. ఎంచేతంటే ఎంతెదిగినా (అని భావించినా) అమ్మ ఒడిలో ఒదిగి ఉన్న బిడ్డలం మనం అన్న స్పృహ స్థిరంగా ఉన్నపుడు, "అడక్కుండానే అన్నీ ఇచ్చే వ్యక్తే అమ్మ" అన్న వాస్తవాన్ని సరిగా జీర్ణించుకుంటాం. మనం "కోరినవి" కాదు మనకి "కావలసినవి" ఇస్తుంది. ఒకసారి ఎవరో "మీరు ఏమైనా ధ్యానం చేస్తారా?" అని అడిగితే "మీ ధ్యానమే" అన్నది అమ్మ.

ఈవిధంగా ప్రవర్తించటానికి ఆస్కారం, ఆధారం అమ్మ చెప్పనే చెప్పింది. ఆమె ఇచ్చేవన్నీ "వరాలు" మంచి చెడు అన్న విభజన మనసు చేసే విభజన. వాస్తవానికి తొడిగిన మన ఆవేశ, కావేశాల ముసుగు. ఒకసారి గజేంద్రమోక్షం ఘట్టం వివరిస్తూ శ్రీరామ్‌సర్ అన్నారు. తనను హింసిస్తున్న మొసలి కూడా ఆయన సృష్టే అనుకేంటే - ఆ విచక్షణ, వివేకం ఉంటే - గజేంద్రుణ్ణి రక్షించటానికి పరుగు పరుగున శ్రీ మహావిష్ణువు రావలసిన అవసరం ఉండేది కాదు కదా! అమ్మ "ఇందుగలదు అందులేదని" అనుకోగలమా? గజేంద్రుడు ఆ విపత్తుకి ఎన్నుకున్న నిమిత్తమాత్ర పరికరం ఆ "మకరం". అమ్మ మనకి సృష్టి అంతా తానే అన్న వాస్తవం మనలో స్థిరంగా నాటుకొనటానికి ఏ పరికరాలు ఎన్నుకుంటుందో మనకి తెలియదు. అది మన పనికాదు.

ఇదంతా - మంచి, చెడుల విభజన - మన మనస్సు అనారోగ్యం అని ఈనాటి మానసిక శాస్త్రజ్ఞులు ఏనాడో కనుక్కున్న సత్యం అని ధృవీకరిస్తున్నారు. ఈ రకంగా ధృవీకరించి చెప్పటం అమ్మ స్వభావం కాదు. ఒక ప్రశ్నకి జవాబు చెపుతూ అమ్మ అన్నది "ఈ ద్వంద్వాలకు ఏపేరైనా పెట్టుకుందాము. దీని పేరు పుణ్యాపాపాలనండి, మంచి చెడ్డలనండి. ద్వంద్వమే అనేకమైంది కనుక అందులో అనేక రకాలుగా వస్తుందని భిన్నత్వం లేకపోతే సృష్టేలేదని, భిన్నత్వం లేని మనస్తత్వం ఎక్కడుంటుందో అదే దైవత్వం అని నా ఉద్దేశం... మేడలో వున్నవాడూ బాధపడుతున్నాడు. ఒకడొక రకంగా బాధపడ్తుంటే ఇంకొకడు ఇంకొక రకంగా బాధపడ్తున్నాడు."

ఈ అంశాన్ని మరింత "పదునుగా" చెప్పింది అమ్మ. "ఆనందమనగా ఎట్టిది?" అని ఒకరు అడిగితే, అమ్మ అన్నది, "ఆనందమంటే దుఃఖము, సంతోషము రెండింటికి



ఏ మార్గాన నడిచినా వాడే నడిపిస్తున్నాడనుకోవటమే సన్మార్గం. - అమ్మ

కాంక్షించే (ఒక్కొక్కసారి "కామించే" ప్రతీది అని అనటానికి లేదు. ఎంచేతంటే ఎంతెదిగినా (అని భావించినా) అమ్మ ఒడిలో ఒదిగి ఉన్న బిడ్డలం మనం అన్న స్పృహ స్థిరంగా ఉన్నపుడు, "అడక్కుండానే అన్నీ ఇచ్చే వ్యక్తే అమ్మ" అన్న వాస్తవాన్ని సరిగా జీర్ణించుకుంటాం. మనం "కోరినవి" కాదు మనకి "కావలసినవి" ఇస్తుంది. ఒకసారి ఎవరో "మీరు ఏమైనా ధ్యానం చేస్తారా?" అని అడిగితే "మీ ధ్యానమే" అన్నది అమ్మ.

ఈవిధంగా ప్రవర్తించటానికి ఆస్కారం, ఆధారం అమ్మ చెప్పనే చెప్పింది. ఆమె ఇచ్చేవన్నీ "వరాలు" మంచి చెడు అన్న విభజన మనసు చేసే విభజన. వాస్తవానికి తొడిగిన మన ఆవేశ, కావేశాల ముసుగు. ఒకసారి గజేంద్రమోక్షం ఘట్టం వివరిస్తూ శ్రీరామ్‌సర్ అన్నారు. తనను హింసిస్తున్న మొసలి కూడా ఆయన సృష్టే అనుకేంటే - ఆ విచక్షణ, వివేకం ఉంటే - గజేంద్రుణ్ణి రక్షించటానికి పరుగు పరుగున శ్రీ మహావిష్ణువు రావలసిన అవసరం ఉండేది కాదు కదా! అమ్మ "ఇందుగలదు అందులేదని" అనుకోగలమా? గజేంద్రుడు ఆ విపత్తుకి ఎన్నుకున్న నిమిత్తమాత్ర పరికరం ఆ "మకరం". అమ్మ మనకి సృష్టి అంతా తానే అన్న వాస్తవం మనలో స్థిరంగా నాటుకొనటానికి ఏ పరికరాలు ఎన్నుకుంటుందో మనకి తెలియదు. అది మన పనికాదు.

ఇదంతా - మంచి, చెడుల విభజన - మన మనస్సు అనారోగ్యం అని ఈనాటి మానసిక శాస్త్రజ్ఞులు ఏనాడో కనుక్కున్న సత్యం అని ధృవీకరిస్తున్నారు. ఈ రకంగా ధృవీకరించి చెప్పటం అమ్మ స్వభావం కాదు. ఒక ప్రశ్నకి జవాబు చెపుతూ అమ్మ అన్నది "ఈ ద్వంద్వాలకు ఏపేరైనా పెట్టుకుందాము. దీని పేరు పుణ్యాపాపాలనండి, మంచి చెడ్డలనండి. ద్వంద్వమే అనేకమైంది కనుక అందులో అనేక రకాలుగా వస్తుందని భిన్నత్వం లేకపోతే సృష్టేలేదని, భిన్నత్వం లేని మనస్తత్వం ఎక్కడుంటుందో అదే దైవత్వం అని నా ఉద్దేశం... మేడలో వున్నవాడూ బాధపడుతున్నాడు. ఒకడొక రకంగా బాధపడ్తుంటే ఇంకొకడు ఇంకొక రకంగా బాధపడ్తున్నాడు."

ఈ అంశాన్ని మరింత "పదునుగా" చెప్పింది అమ్మ. "ఆనందమనగా ఎట్టిది?" అని ఒకరు అడిగితే, అమ్మ అన్నది, "ఆనందమంటే దుఃఖము, సంతోషము రెండింటికి

సంబంధించినది. రెండింటి కలయికే. దుఃఖము కాని, సంతోషము కాని వద్దని ప్రయత్నము చేయక, ఏది వచ్చినా స్వీకరించి అనుభవించే స్థితియే ఆనందము" ఇంత విస్పష్టముగా చెప్పినా, ఈ రెండూ ఎక్కణ్ణించి వస్తున్నాయో కూడా స్పష్టం చేసింది. ఆ మూలం "తానే" అని చెప్పి, ఏ వెంపర్లాటలు, శాస్త్రజ్ఞానాల గందరగోళం లేకుండా వాటిని అంగీకరించటం తేలిక చేసింది.

తెలిసి తెలిసి అమ్మ దుఃఖం కలిగిస్తుందా? అన్న ప్రశ్న అటుంచండి. ఎందుకంటే ఆమె దృష్టిలో అది దుఃఖం కాదు. ద్వైతంలో దుఃఖమే. అయితే దాని అవసరం దానికి ఉంది కదా! దీనివల్ల ప్రారబ్ధాలు, పునర్జన్మలు, వాటి ఫలితాలు అనుభవించటం – ఈ తికమకలను పక్కకి తొలగించే అవకాశం ఇచ్చింది అమ్మ. ఇటువంటి వాటిని ఆలవోకగా పక్కకి పెట్టింది అమ్మ. ఒకస్వామి అమ్మకి "సంస్కారం వుంది. శాస్త్రజ్ఞానం లేదు. బాగా శాస్త్రం చదువుకో" అని సలహా ఇస్తారు. అపుడు అమ్మ "శాస్త్రం అనుభవం ఇవ్వదు. అనుభవం శాస్త్రాన్నిస్తుంది" అని చెపుతుంది (చెప్పి ఆస్వామికి కోపం కూడా తెప్పిస్తుంది).

"అనుభవం" అన్నది అతి ముఖ్యమైన మాట. ప్రధానమైన క్లూ. అనుభవం నుంచే సూక్ష్మాలు తెలిసేవి. ఆ అనుభవాలని మంచి, చెడు, సుఖం, దుఃఖం అన్న విభజనే మనం తప్పించుకోవలసింది. కాని తమాషా ఏమిటంటే ఈ తప్పించుకొనటం కూడా ఆమె ఇచ్ఛపైననే ఆధారపడి వుంది. అయితే ఈ విధంగా ఒక భావాన్ని అక్షరబద్ధం చేయటం చాలా ప్రమాదకరం. ఎందుకంటే అమ్మ ఒక సందర్భంలో చెప్పినది మరొక సందర్భంలో దానికి విరుద్ధంగా చెప్పవచ్చు...

మనందరికి ఒక భావం సర్వసాధారణం : దేన్నైనా తప్పించగలిగే శక్తి అమ్మకు ఉన్నపుడు, మనల్ని కొన్ని బలహీనతలనుంచి సునాయాసంగా తప్పించవచ్చు కదా! ఈ ప్రశ్న ఒకరు అమ్మవద్ద లేవనెత్తారు. "మానవులు దుష్కర్మ చేస్తున్నపుడు దుష్కర్మ సత్కర్మలు రెండింటికీ కర్తవైన తల్లివి. మీరు ఈ బిడ్డల మనస్సులు మార్చి సన్మార్గంలో పెట్టవచ్చు కదా?" చాలా నిశితం. అవసరం అయిన ప్రశ్న ఇది. మరి అమ్మ సమాధానం? "నాకు దుష్కర్మ కనపడితేగా?" oh my God! అనిపించింది ఇది

మొదటిసారి నాకంట పడినపుడు. ఈ సమాధానం నన్ను ఎంతగా కదిలించిందో అంతగా కలవరపరిచింది. వెంటనే "మనకి" కనిపిస్తుంది కదా అన్న శంక కలిగింది. ఇది కూడా అమ్మ ముందరే గ్రహిస్తుంది కదా! ప్రశ్నని కొనసాగిస్తూ అన్నయ్య అన్నాడు. "మీరు మా మనస్సులు త్రిప్పి అన్నీ సత్కర్మలే చేయిస్తే జగత్తులో ఈ సంక్షోభం తప్పుతుంది కదా?".

అమ్మ కాదనలేదు. "అవసరమైనపుడు తిప్పుతాను" అని చెప్పింది. ఆ అవసరం ఏమిటో 'నేను' (మనం) ఎట్లా తీర్మానిస్తాం? మన పరిధిలో అవసరం, ఆమె దృష్టిలో అనవసరం.......

ఈ అంశాలన్నింటినీ విశ్లేషించుకున్నా సారాంశం తిరిగి మొదటికే – మూలానికే వెడుతుంది. అయితే అమ్మ చెప్పిన ఒక ప్రశ్న మీ ముందు ఉంచి ముగిస్తాను. ఒక సోదరి అమ్మని అడుగుతుంది "ఈ కష్టాలు ఈ జన్మకు తప్పవా?" అమ్మ స్పందిస్తూ "అది మనస్సుకు సంబంధించినదమ్మా, తృప్తికరమైన పరిస్థితులున్నపుడు మనస్సుకు సుఖంగా హాయిగా ఉంటుంది. ఇష్టమైనవి లేనపుడు కష్టంగా ఉంటుంది. ఇష్టంలేనిదే కష్టం కదమ్మా?" మరి ఆ ఇష్టాన్ని మరింత పరిపుష్టం చెయ్యమని అమ్మని అర్థించటంలో తప్పులేదేమో!







సహన మనే దేవత నారాధించాలంటే బాధలనే పూజా ద్రవ్యాలు కావాలి. – అమ్మ

# అన్ని జీవరాసులకూ సుగతే

- దయామణి

మన దృష్టిలో మనుషులు మాత్రమే లెక్క. జగన్మాత అయిన అమ్మ దృష్టిలో ప్రతి ప్రాణీ తన సంతానమే కదా. అందరూ అన్ని రకాల ప్రాణులు తింటే కాని తల్లికి తృప్తి ఉండదు.

1950 సం॥లో గ్రామంలో కొన్ని కుక్కలకు పిచ్చి ఎక్కిందని ఊరివారు వాటి తలలమీద కొట్టి ఊరికి దూరంగా పారేశారు. వాటిలో ఉన్న 2 కుక్కలు ఆ కొట్టిన దెబ్బలకు మరణించక స్పృహ వచ్చాక నడవటానికి ఓపికలేక పోయినా తగిలిన గాయాలు బాధపెడుతున్నా పరుగెత్తుకొని వచ్చి అమ్మ సన్నిధికి చేరాయి. అమ్మ మజ్జిగ చిలుకుతుంటే కిందపడ్డ మజ్జిగ చుక్కలు నాకి అమృతాన్ని ఆస్వాదించినట్లు దానిలో ఒక కుక్క తేరుకున్నది. మజ్జిగ చుక్కలు నాకినంత మాత్రాన తేరుకునే స్థితి మాత్రం కాదు. ఒకటి అమ్మ పాదాలమీద వాలి ఆత్మార్పణం చేసుకొన్న ధన్యజీవి.

తేరుకున్న కుక్క అమ్మను ప్రాణప్రదంగా ప్రేమించేది. అమ్మకు ఏచిన్న బాధ కలిగినా సహించలేక పోయేది. అమ్మకు కష్టం కలిగించిన వాళ్ళ అంతు కనుక్కునేది. దాని చూపులో, నడకలో, నడతలో అమ్మకోసం ఏ క్షణంలోనైనా ఆత్మార్పణం చెయ్యగల త్యాగం, ధైర్యం కన్పిస్తుండేవి. అనేక సంఘటనల్లో అమ్మకు తోడుగా, మిత్రుడుగా ప్రవర్తించేది.

అమ్మ ఒక సందర్భంలో "దాన్ని గురించి చెప్పాలంటే మనిషి మనిషిని ఎంతగా ప్రేమించవచ్చో అంత దూరం అది నన్ను ప్రేమించింది. ఎప్పుడైనా ఇంట్లో పిల్లలకు జబ్బుగా ఉంటే నేను వాళ్ళదగ్గర కూర్చునే అవకాశం లేక పనిలో ఉన్నప్పుడు నేను పని పూర్తిచేసుకొని వచ్చేవరకు వాళ్ళ దగ్గర కూర్చునేది. ఇంటికి ఎవరైనా కొత్త మనిషి వస్తే నా దగ్గరకు వచ్చి తాకి సంజ్ఞ చేసి చెప్పేది" అని చెప్పింది.

అమ్మదగ్గరకు వచ్చే జనానికి 7వ మైలు రాయి నుండి ఊళ్ళోకి దారి చూపించేది. వూళ్ళోకి ఎట్లా తీసుకొచ్చేదో అట్లాగే పంపి వచ్చేది. అది ఎవరిజోలికి పోయేది కాదు. అనవసరంగా తన జోలికి వస్తే ఊరుకోదు.

అమ్మ స్నానంచేసి హాల్లోకి వచ్చేసరికి రోజూ వచ్చే కుక్క రాకపోయేసరికి కుక్క ఎక్కడుందో చూసి రమ్మని వెతికించింది. అప్పుడు అమ్మ అలంకార హైమ ఉన్న ఇంట్లో ఉండేది. కుక్క దూరంగా (ఇపుడు అన్నపూర్ణాలయం కెదురుగా వున్న ఇసక దిబ్బల మీద) పడుకున్నది. మరణయాతన పడుతున్నది. లేవలేక పోతున్నదని చెప్పారు.

అమ్మ వెంటనే కుక్కను చూడటానికి బయల్దేరింది. అప్పుడు సన్నగా వర్షం పడుతోంది. ఈవర్షంలో, బురదలో వద్దని వారించి కుక్కను నీ దగ్గరకు తీసుకొస్తామన్నాడు రామకృష్ణన్నయ్య. అందుకు అమ్మ నవ్వి దాన్ని "మీరు ఇక్కడకు తీసుకొచ్చేది నా కోసం. కాని దానికోసం కాదుగా. నాకేం పర్వాలేదు. నేను వెళ్ళాల్సిందే" అని బురదగా వున్న నేలమీద కూడా పొడి నేలమీద నడిచినట్లు చకా చకా నడుస్తూ అంతిమ దర్శనానికి ఎదురు చూస్తున్న ఆ కుక్కను (భక్తుడ్ని) సమీపించింది నిరవద్య అయిన అమ్మ.

అప్పుడే పాలు తాగించడానికి ప్రయత్నిస్తున్న సోదరి చేతిలో పాలల్లో తులసిదళాలు తెప్పించి వేసి కుక్కపక్కన కూర్చొని ఆప్యాయంగా దానిమీద చెయ్యివేసి నిమురుతుంటే - తన ప్రార్ధనలనాలకించి వచ్చిన ఆర్తత్రాణ పరాయణ అయిన అమ్మ అమృతస్పర్శకు ఆ కుక్కలోని నరనరమూ ఆనందంతో పులకించిందేమో ఆ ఆనంద ఛాయలు దాని కదలికలోనే కాక ముఖంలో కూడా కన్పించాయి కళ్ళు విప్పి అమ్మను చూడాలని ప్రయత్నం చేసింది.

పాల గిన్నె ముందు పెట్టినా కుక్క ముట్టుకోలేదు. దాని నర్థంచేసుకున్న అమ్మ దాని మూతికడిగి శరీరమంతా నీళ్ళు చల్లి తోకవైపు భాగం తుడిచి చెవి పట్టుకుని అక్కడ వున్న కురుపు చూచింది. అది బాధగా మూల్గింది. మళ్ళీ ఒకసారి నీళ్ళు చల్లి చెవి అంతా కడిగి శరీరమంతా నిమిరి వెచ్చగా వున్న ప్రదేశంలో పడుకో బెట్టమన్నది (వాతావరణం చాలా చల్లగా వున్నది)

తర్వాత 2 రోజులకు అంతిమ శ్వాస వదిలి శాశ్వతంగా అమ్మను చేరింది. ఈ విషయం విన్న అమ్మ మరో కుక్కలుగాని, జంతువులు గాని పీకి తినకుండా గొయ్యితీసి పూడ్చిపెట్టమన్నది. శరీరత్యాగం చేసిన తర్వాత కూడా అమ్మ బిడ్డపై



జనన మరణాలు గురించి క్రుంగు పొంగులు లేకపోవటమే అమృతత్వం. - అమ్మ

చూపిన వాత్సల్యం సంస్కారమనేది కేవలం మానవులలోనే కాక మిగతా జీవజాలంలో కూడా ఉన్నదని మనకు తెలియచేసిన ధన్యజీవి.

కుక్క అమ్మ చరిత్రలోనే ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించింది. ఈ కుక్కే అమ్మసన్నిధిలో మెలిగే ఆవు దగ్గర పాలు తాగింది. ఇదే పిల్లికి పాలిచ్చింది. ఈ పిల్లి 'మ్యావ్' అన్న ధ్వనిలో ఓంకారం ధ్వనించేది. అమ్మ పని చేసుకొని తీరిక వేళలో గుంజకానుకొని కూర్చునుంటే ఎలుకలు, పిల్లులు కలిసి అమ్మ పమిట చెరుగుమీద స్నేహితుల్లా ఆడుకుండేవి. ఆదృశ్యం కనువిందుగా ఉండేది.

ఒకసారి అమ్మగదిలో పిల్లులు బాగా తిరుగుతుండేవి. అవి అమ్మ మంచం మీదకెక్కి అమ్మ సింహాసనంలోకి దూకి మూత్ర విసర్జనతో కలుషితం చేసేవి. అమ్మ దుప్పట్లలో ఆడుకుంటూ చింపేవి. అలమరలో నక్కి కూర్చుని అమ్మ దుప్పట్లన్నీ ఖరాబు చేసేవి. తమ పిల్లలకు ఆహారం కోసం రోజూ రాత్రిళ్ళు ఎలుకలను చంపి అమ్మ గదిలోకి తీసుకొచ్చేవి. తెల్లవారేసరికి అంతా రక్తపు మరకలు, మాంసపు ముక్కలు. ఆ దృశ్యాలను చూసి సహించలేకపోయే వాళ్ళము. ఒకరోజు పిల్లి, పిల్లలను గోతంలో వేసుకొని వాటిని మరో ఊరిలో వదిలి రావటానికి ఆలోచించారు.

ఈ విషయం అమ్మకు తెలిసి వాటిని స్వేచ్ఛగా వదిలేయండి. మీరు బజారుకు వెళ్ళారనుకోండి అక్కడ మంచి పళ్ళుకనిపిస్తాయి. వాటిని కొనుక్కొచ్చి మీ పిల్లలకు పెడదామనుకోరూ? తోటలో మంచి కూరగాయలు చూసినా వాళ్ళకిష్టమయినవి తెచ్చిపెట్టుకోరూ? అవి అంతే! వాటిని గురించి ఇంత అల్లరీ, ఆగమూ ఎందుకూ? వాటిని ఏం చెయ్యద్దు. ఎక్కడికీ పంపద్దు అన్నదా దయార్థ్ర హృదయ

ఒకసారి అమ్మగదిలోకి ఒక కాకి వచ్చి అటూ, ఇటూ తిరుగుతున్నది. అది ఎంత తోలినా పోవటం లేదమ్మా అంటే అదీ నా కోసమే వచ్చిందన్నది.

మరొకసారి నేతితో పూరీలు చెయ్యమన్నది. పూరీలు చేసి అమ్మకిచ్చాను. అవి తుంచి ముక్కలు చేసి వాకిట్లోకి వచ్చి ఒక్కొక్క ముక్క కాకులకి కింద పడకుండా నోటితో పట్టుకునేలా ఎగురవేస్తుంటే "అమ్మా కాకుల కోసమా నేతితో చేయమన్నది" అని ఆశ్చర్యంగా నేనంటే "వాటికి నేతితో ఎవరు పెడ్తారు. అవీ రుచిగా తింటాయి కదా!"

అనేది. అలాగే గారెలు కూడా నేతితో చేయించి వాటికి పెట్టేది. వాటిపై ఎంత మమకారమో! మొక్కజొన్న పేలాలు వేయించమని, అవి కూడా ఎగుర వేసేది. అవి కింద పడకుండా కాకులు పట్టుకునేలా. అవి ఎగిరెగిరి పట్టుకుంటుంటే అమ్మ కళ్ళల్లో ఎంత ఆనందమో! వాటికి ప్రత్యేకంగా వండి పెట్టాలనీ, రుచిగా పెట్టాలనీ మనకుండదు కదా!

అమ్మ ఇంట్లో ఒక గుడ్డి గేదె ఉండేది. అమ్మ ఎక్కడికి వెళ్తే అది అమ్మకు తోడుగా వెంట ఉండేది. అమ్మ బయటకు వెళ్తుండగా ఒక సర్పం వచ్చింది. అమ్మను ఆ పాము ఏం చేస్తుందోనని అది అవతలకు వెళ్ళిందాకా ఆ బత్తైఅక్కడ్నుంచి కదల్లేదు. దానికి అమ్మ అంటే ఎంత ఆరాధనో!

ఒక ఆంబోతు ఎద్దు ఉండేది. అమ్మ చుట్టూ రోజూ ప్రదక్షిణం చేసేది. అమ్మ మంచం చుట్టూ ఎంత మంది పడుకున్నా తొక్కకుండా వెళ్ళేది.

ఒక శుక్రవారంనాడు అందరం అమ్మకు పూజ చేసుకుంటుండగా అక్కడకు ఒక పాము ప్రవేశించింది. దానిని చూచిన అందరం భయపడుతున్నాము. అది మెల్లిగా పూజాద్రవ్యాల క్రిందకు చేరింది. అంతా గమనిస్తున్న అమ్మ "దాన్ని కదలించవద్దు. అది పూజ చూడడానికి వచ్చింది. అది అపకారం చేసినవాళ్ళ జోలికే పోతుంది. మనం అందరి జోలికిపోతాం" అన్నది. అమ్మ అన్నట్లే ఆ పాము పూజ పూర్తయ్యే వరకు ఉండి ఎటు వైపు వెళ్ళిందో మాకెవ్వరికీ తెలియదు.

ఒక రోజు అమ్మ హాల్లో మంచం మీద కూర్చుని దర్శనమిస్తుండగా ఒక కప్ప వరండాలో అటూ, ఇటూ తిరుగుతూ హాల్లోకి ప్రవేశించింది. అమ్మ రమ్మని పిలవగానే అది అంతే చాలనుకుని అమ్మ మంచం పైకి ఎక్కింది హుషారుగా. అమ్మ మంచం దిగి వరండాలోకి వెళ్తూ కప్పను రమ్మని తలూపింది. వెంటనే దిగింది. అమ్మ దానితో ఏం మాట్లాడిందో, దానికేమి అర్థమయిందో మరి.

అమ్మ ఒక రోజు ఆరుబయట పందిట్లో మంచం మీద కూర్చున్నది. అప్పట్లో కరెంటు లేదు. పెట్రోమాక్సు లైటు వెలిగించి స్థంబానికి తగిలించారు. ఆ లైటు చుట్టూ పురుగులు చేరినై. అమ్మ మంచం చుట్టూ చుట్టుముట్టాయి. ఆ పురుగుల్ని

దులపబోతుంటే అది చూచిన అమ్మ "దులపబోకండి. ఉండనీయండి. అది వాటి సంస్కారము" అన్నది. అవి అటూ ఇటూ తిరుగుతున్నయ్. వాటిలో ఒక నల్లని పురుగు ఒకటి అమ్మ వక్ష స్థలంపై వాలింది. అమ్మ దానిని ముద్దు పెట్టుకున్నది. "చూడమ్మా ఈ పురుగు దీన్ని ముద్దు పెట్టుకున్నా వదలటం లేదు. దీని సంస్కారం. సంస్కారమనేది ఎవరికైనా ఒకటే. ఇన్ని పురుగులున్నై కదా. ఇది ఒక్కటే రావటానికి దీని సంస్కారమేగా. చూడు, ఎట్లా మెల్లిగా నడుస్తున్నదో" అన్నది. ఆ నల్లపురుగు సుమారు ఒక అరగంట మెల్లిగా నడుస్తూనే అమ్మ శరీరమంతా సృశిస్తున్నది. ఈ అవకాశం మళ్ళీ లభ్యం కాదేమోనన్నట్లు. అమ్మ చూట్టూ పరివేష్టితులైన సోదరీ సోదరులు అమ్మకు వాటిపై గల మక్కువకు అమ్మ చర్యలకు చకితులైనారు.

ఇలాగే దోమల్లో కూడా. అమ్మ పాదాలకు ప్రదక్షిణ చెయ్యటం. మరికొన్ని అమ్మపాదాల మీద ఆత్మార్పణ చేసుకోవటం. అమ్మ అన్నట్లు అది వాటి అదృష్టం, సంస్కారం. కందిరీగ కుట్టి చెయ్యి వాచి బాధపెడ్తున్నా సేవ చేసుకొని వెళ్ళిందనేది. పురుగు వాలి గట్టిగా పట్టుకొని వదలక పోయినా "అది దాని సంస్కారం, దాన్ని సేవ చేసుకోనివ్వండి" అంటుంది.

చీమలు శరీరం మీద పాకుతున్నా, తను బాధ పడ్తున్నా కాలు కదల్పదు సరిగదా తియ్యనివ్వదు.

తన సంతానం అంతా తన చుట్టూఉండాలనే కోరికే. "గడ్డ లేచిందిట గదమ్మా!" అంటే "గడ్డ కూడా బిడ్డే" అన్నది. "నీకీ బాధలేమిటమ్మా?" అంటే "అవీ మీలాగే" అంటుంది అమ్మలోని మాతృత్వం.

కాకులు, కుక్కలు, పిల్లులు, పిచ్చుకలు, చీమలు, దోమలు, పురుగులు సమ్తజీవులు అమ్మ ప్రేమలో మునిగి తేల్తూంటాయి.

ఒక సందర్భంలో అమ్మ అన్నది "తరించటానికి మానవజన్మయే అవసరం లేదు. ప్రతి వ్యక్తీ ప్రతి వారు బాగుపడటానికే వచ్చింది. ఎవ్వరూ వృధాపోరు అందరికీ సుగతే. కాస్త వెనుకా ముందు తేడా అంతే".



